# రాధామాధవ సంవాదము



కర్త:

వెలిదిండ్ల వేంకటపతి.




యస్. అప్పలస్వామి అండ్ సన్సు

పబ్లిషర్సు అండ్ బుక్ సెల్లర్సు.

రాజమండ్రి.

1949

గీ. నదియె చతురంగబలములై యతిశయిల్ల, మొల్లమై యున్న ప్రేపల్లె నల్లుకొన్న
ఫలితవనములు కోటలై పరిఘవిల్లు, నందుఁ జెలువొందు నందుఁ డానంద మొంది. 7

క. ఒకపశువుఁ బ్రోచువానికి, సకలఫలంబులును గల్గు సంతతమును కో
టికిమించుపశుగణంబులఁ, బ్రకటంబుగఁ బ్రోచు నతనిఫల మే మందున్. 8

గీ. అతనిపుణ్యంబునన్ లేక యతనిపుణ్య, పత్నియగు యశోదాదేవిభాగ్యమునకా
కృష్ణుఁ డుదయించె వారి కింకేమి తెలుప, జలజనయనునిభక్తవాత్సల్యమహిమ. 9

చ. చిగురులపాదము ల్కళలఁజెక్కడుప్రేళ్ళు నొయారిపిక్కలున్
జిగితొడ లందపుంబిఱుఁదుఁ జెన్నగుబొజ్జ వెడందఱొమ్ము బా
గగుకరము ల్వన్నసుంగళము నద్దపుఁజెక్కులు నవ్వుమోము తే
టగుకనుదోయి ముద్దుగురియన్ జెలఁగెన్ హరి యందు బాలుఁడై.

సీ. పట్టాభియోగసౌభాగ్యము ల్దిలకించి, నందుండు సంతతానంద మొందఁ
దొట్రుపల్కులు ముద్దుదొలఁకునవ్వులు గాంచి, మురిసి యశోద సమ్మోద మంద
నవమోహనాంగసౌందర్యంబు భావించి, పసిగాఁపుగుబ్బెతల్ పైఁబడంగఁ
బూఁటపూఁటకు వృద్ధిబొందురూపముఁ జూచి, జనులెల్ల నాశ్చర్యమునఁ జెలంగఁ

గీ. దలిరువలె గోముపై మొగ్గవలెను సోగ, లై యలరువలె మృదువుపై కాయవలెను
బెక్కుపై పండువలె నెఱచొక్కు మగుచుఁ, దీవెవలెఁ దేటలై శౌరి తేజరిల్లె 11

ఉ. అప్పుడు లేఁతప్రాయమున నాడుచు నందునిముద్దుఁ జెల్లెలౌ
కప్పురగంధి రాధ యనుకన్నియ యొక్కయనామధేయుఁ డి
న్నప్పుడె పెండ్లియాడి మగఁడంచని చూడదు వాని వాఁడు నా
యొప్పులకుప్పఁ గన్గొనఁగ నోడును బ్రీడను గొల్లవెత్తిచేన్. 12

క. వెన్నెలను జలువ పుట్టిన, చెన్నునఁ బువ్వులను దావి చెలఁగినరీతిన్
గన్నియసకలాంగంబులఁ, దిన్నఁగ నొకవింత వొడమె దినదినమునకున్. 13

క. వనిత తనుఁదానె చూచుక, తనలోఁ దా నున్న రను వికాసై తనకున్
దనసొగసుకుఁ దనముచ్చట, కనువైనప్రియుండు లేని యారాటమునన్.

క. తొల్లి తప మేమిచేసెనొ, కొల్లగఁ బసిపాలుఁడైన గోపాలునితో
మల్లాడుచు నెల్లప్పుడు, చెల్లాటల నుండు రాధ జిలిబిలితమిచేన్. 15

క. బాలుఁ డగుశౌరి నెత్తుక, హేలాగతి ముద్దులాడు నేపారిద్దు వృథా
కాలక్షేపంబునకును, జాలక రాధాలతాంగి చాలవిరాళిన్.

ఉ. భావిఫలాభిలాషమున బాలుని క్షేమము గుగ్గు పెట్టుఁ బె
య్యావులపాలతో జలకమార్చును దాఁ దొడనుంచి యేమిచూ
చేవనినవ్వుచున్ బయటఁ జేఁ దడియొత్తి సిరామరక్షతోఁ
గావుగఁ జొక్కబొట్టు నొసలన్ ఘటియించి కదించు నుయ్యెలన్. 17

ఉ. నాపెలలేనిమానికము నాతొలినోముల మెట్టపంట నా
దేవుఁడ నామనోరథముఁ దీర్ప జనించినచక్రనయ్య నా
జీవనజీవనంబ యదుశేఖర యించుక నిద్ర పోఁగదే
యో పెదమాయకాఁడ ! యని యుయ్యెల నూఁచును రాధ మాధవున్.

గీ. ఏమఱించి కృష్ణుఁ డిండ్లలోఁ జొరఁబడి యున్న పాలు పెరుఁగు వెన్న నెయ్యి
కొల్లలాడుచుండ గోపిక లొకనాఁడు, దొమ్మిగూడి రాధతోడ ననిరి. 19

క. ఉట్లపయి నున్నవెన్నల, చట్లను గొంచుఁబోయి సంగాతులతో
నాట్లాడఁదొడఁగె మాబ్రతు, కెట్లా కడవెళ్ళునమ్మ యిట్లాగయినన్. 20

క. ముద్దిమ్మని బలిమిని మా, ముద్దియచే నున్నవెన్నముద్దలు గొనె నీ
ముద్దులబాలుఁడు నీ కిది, ముద్దయినన్ గొమ్మ మాకు ముద్దటవమ్మా. 21

క. బంతులటంచును జెలిచను, బంతులు బిగఁబట్టి లేదు బంతి యటంచున్
గంతులువైచెను ముముఁ గని, కాంతా యిటు లగునె యింతకలవారలకున్. 22

క. మందకుఁ జనితాఁగను మా, మందగమన నాఁగి నీదుమగఁ డెవఁ డనుచున్
గందువమాటల నడిగె, న్నందమె మనజాతి కిట్టి యాగడము చెలీ. 23

క. నీపైన బుద్ధి తెలుపుము, నీవలనన గాక యుండె నీమె యశోదా
దేవికిఁ దెలిపెద మనఁగా, నావేళకుఁ బులిమిపుచ్చి యారాధ వడిన్. 24

క. ముద్దిచ్చును గోపాలుఁడు, వద్దను నగయాడుచున్నవార్తలు విన్నన్
గద్దించును లేదన్నను, బద్దించును జాదకున్నఁ బరితాపించున్. 25

ఉ. ఓయి మనోహరాంగ పనియున్నది పోయెదుగాని యిట్లు రా
వోయి మహానుభావ యని యూరక పిల్చును బిల్వ నేమి రా
దా యని యాతఁడున్ బలుకఁ దా విని నవ్వుచు వేగ నిందు రా
వోయి భుజింపఁగావలదటోయి యటంచు వచించు బాళితోన్. 26

ఉ. పదుచులతోడ నాడ పనిబాలుఁడవా వలదన్న మాన వా
గదములు కొన్ని నేర్చితివి కల్లరి వైతివి కొల్లకాఁడ వై

దుడుకులు సేయసాఁగితివి దొంగిలఁజొచ్చితి వేమి తెల్పినన్
వడిగఁ బరాకుచేసికొని వాకిటి కేఁగెదు పిల్వఁబిల్వఁగన్. 27

ఉ. బుద్ధులు దెల్పఁబోవుగతిఁ బూనుక కన్నులు పుల్ముకొంచు నే
ప్రొద్దున లేచి యిండ్లఁబడి పోయెద వమ్మక చెల్ల పిన్నవుం
బెద్దవుఁగావు బువ్వ దినిపించెదఁ జక్కనిసామి రార నా
ముద్దులకృష్ణ రార యని మ్రొక్కుచుఁ జీరును రాధ మాధవున్. 28

ఉ. అల్లుఁడ దొండపండు వలెనా యని వాతెర యాన నిచ్చి నీ
కొల్లవె పుట్టచెండు వివిగో యని చన్గవఁ బట్ట నిచ్చి రా
గిల్లి మయూరపింఛ మడిగేవని పెన్నెరు లంట నిచ్చిఁ బో
కల్లరి యంచుఁ గృష్ణుఁడు నగ న్నగి రాధ యదేమిరా యనున్. 29

సీ. తీరుగాఁ గస్తూరితిలకంబు దిద్దుచో, గమకించి నెమ్మోముఁ గదియఁజేర్చు
హాయలుగా గంధంబు మెయినిండఁ బూయుచో, బరికించియిక్షువల్ గరగనంటు
మెలపుగా సిగను బూవులదండ చుట్టుచో, బులకించి కుచము వీఁపునఘటించు
హారువుగాఁ గై సేసి యద్దంబుఁ జూపుచో, దిలకించి తనమోముఁ దెలియఁజూపుఁ
గీ. తెలఁగి మాటాడబోవుచోఁ జెక్కు గీటు, బిలిచి వీడెం బొసఁగుచోఁ బెదవిఁగొఱుకు
గదిమి పైఁబడఁ దిగుచుచోఁ గౌఁగిలించు, దమిమనంబున నాఁటిరాధావధూటి. 30

క. కడిమాడ సేయుభోజన, మిడుఁ బిడికిట నిముడు వలువ లిచ్చును బెడఁగా
తొడవులు దొడుగును బడిబడి, గడెగడె కొకవింతసొగసు గావించుహరికిన్. 31

సీ. ఎవతెతో సయ్యాట మింటిలోన నటించు, భయపడ నదలించు బైటనుండి
చంటిపైకొక సడల్చి జారుపైఁట ఘటించి, యేది బాగని కేఁడు నెదుటనిల్చి
వాకిట మగవారు రాకుండ నిలుమంచు, జలువకోక ధరించుఁ దలుపుమూల
దాఁగనేరవు పల్కుదారి గాదని ద్వూరు, వలదని మురిపాన వద్దఁ జేరు
నాఁడునాఁటికి గోపాలుఁ డీడుమీఱి, తొలుత నూనూఁగుమీసాలతోఁ జెలంగఁ
బదరి మునుపటెఁ బైబక్కఁబడఁగ నళికి, బెళఁకు వగఁగుల్కు మరునికి బెదరి రాధ.

క. ఆరాధమనోజవ్యధ, నీరీతుల నిరుగుపొరుగు లెఱుఁగకయుండన్
గారాబు సేయుఁ గృష్ణుఁడు, చేరక తా నది పరాకు చేయుచునుండెన్. 33

సీ. తొలుదొల్తఁ బన్నిగాపుఁగులుకు గుబ్బెత యొంటి, పాపైనమోము తప్పకయె చూచుఁ
జూపువెంబడిఁ దన్నుఁ జూచి సిగ్గున నిల్వ, దలయూఁచి కోరికల్ దెలియ నవ్వు
నవ్వువెంబడిఁ జిన్ననాటిముచ్చిక లెంచి, తను నరమోదయుజూప ననుచుఁ బలుకుఁ
బలుకువెంబడి గేలఁ బైఁటకొంగెసలించి, నునుజన్ను లాన ఱొమ్మునకుఁ జేర్చు

గీ. జేర్చి మునిపంట జిగిమోవిఁ జీరనొక్క, నొక్కి సొక్కించి మరుకేళి ప్రక్కఁ జేయఁ
జేసి కనుమాటి యింటికిఁ జేరనగుగు, నగి తనుగానిరీతి తనంతనుండు 34

క. ఆచిన్నెలు నవనవఁ గా, జూచాయఁగ విని చలించి ప్రక్కన రాధన్
జూచి యదేమే రాధా, నాచాయన్ సిగ్గువడెదు నాహరి కనియెన్. 35

సీ. చెంత నీవును లేక చింతతోఁ బవళించి, నిదురబోవుచునుండ నిన్నరేయి
కలలోన నొక్కచక్కని రాచకొమరుండు, వచ్చె నివ్వఁ డటంచుఁ వచ్చెఁదానె
నొకకొంతసేపు తప్పక చూడఁ జూడంగ, నీపోలికై యున్న నీవటంచు
రార కృష్ణా యని బారతోఁ జేసాఁప, నేమె రాధా యని యెదురుకొనుచు
గీ. నెనసి యేమేమొ వింతగా నింపునేర్చి, నంత మేల్కాంచి నినుఁ గాంచి యదితలంచి
మురిపెమున నిన్నుఁ జూడక మోమువంచు, కొంటి నాసిగ్గు నేమనుకొందు నోయి.

మ. అనినన్ బక్కున నవ్వి చిక్కితివి రాధా సాధువే యంచు నుం
టిని నీసాధుసమీఁదిప్రేమ వినఁగంటిన్ దుంటవిల్దంట వెం
టనె యంట న్ననవింటితూఁపు లెద నంటన్ దుంట లింకేల నీ
ధ్వని వాచారసభావభావథవగాథల్ నీవగ ద్దెల్పెడిన్. 37

క. విరిదోఁపఁ దావి దాఁగునె, పరిపరి పలుకేలనిజము పలికితి వో సా
ధర వినమె "సత్యవాణీ సరస్వతి" యటన్నమాట చదువులలోనన్. 38

క. అనిపల్కు కోరపలుకుల కును మెచ్చుచునిన్ని నాళ్ళకును నీవైనన్
మనసెఱిఁగి చిక్కఁబట్టితి, తనుఁ బో యని కృష్ణుతోడఁ దానిట్లనియెన్. 39

సీ. కండచక్కెరపానకంబు గావలెనందు, వదిగోరవేమిరా యంబుజాక్ష
రంగుబంగరుబొంగరాలు గావలెనందు, వవి గోర వేమిరా మదనజనక
యిసుకతిన్నెలమీఁద నెక్క గావలెనందు, వది గోర వేమిరా మదనరూప
తోడిబాలురతోడ నాడగావలెనందు, వది గోర వేమిరా యమరవంద్య

గీ. తియ్యనై యున్న యలమోవి తేనె వలతో ?
జంటగొనియున్న యలచన్ను లంటవలతో ?
త్రొక్కదసినపిఱుఁదుల నెక్క వలతో ?
జోడువాయక స్త్రీలతో నాడవలతో ?

ఆ. నీకువాడమెల్ల నిన్నరాతిర గంటి, నమ్మ వెల్ల న్నినును నమ్మరాదు
నవ్వుగాదు రేయి నాప్రక్కలోనుండి, కలువరించలేద చెలువ నెల్ల.

ఉ. అందుల కాసయేని మగవాండ్రపయిం బడి దూరు వొందఁగా
నెందుకు కంటి కింపు యినయింతుల నల్గుఁ బెండ్లిసేయనో

గీ. ఒంటి నెదురైన రాధ యోరోరి కృష్ణ, తాళు తాళు మటంచనఁ దాళు శౌరి
పదుగు రున్నప్పుడొకమాట పైఘటించి, తాళు తాళు మటంచనుఁ దనకుఁదాన.

చ. విడు విడు నీకొసంగ నని వేఁటొక బాలున కొక్క తియ్యమా
మిడిఫల మీయఁబోవ బలిమిం గొని తా మొనపంట నొక్కి గ్రు
క్కుఁడురస మాని సిత్కృతు లొగిం జెలఁగం దలయూఁచి చూచెఁ గో
రడిమున రాధికామధుర రాగసుధాధరవీటి సారెకున్. 61

క. ఆముద్దు చూచి రాధిక, యేమటితి నదేమి చూచితివన నగి నే
నేను నినుఁ జూచినట్టులం, నీమనమునఁ దోఁచెఁ దలంపు నీకని పేఁడన్. 62

చ. తెలిపెద రమ్మటంచు సుదతీమణి దుప్పటికొంగుఁ బట్టి లో
పలిపడకింటికిన్ దిగువఁ బద్మదళాక్షుఁడు మోడిమానిసిం
బలెఁ జని తెల్పుమంచనిన మంచిది పానుపుఁ జూడుమన్న ని
శ్చలుఁడయి కొంతసేపునకు జవ్వనిఁ దప్పక చూచి యిట్లనున్. 63

ఉ. మొన్ననె తెల్పలేదఁటవె మొన్నటి నిన్నటి పిన్నవాఁడ నాఁ
కొన్నను నీవు భోజనము కోరి యిడన్ వలె నెత్తిపెంచినా
వెన్నఁడు లేనిమాట లిటులేటికి నాడెదు మాటిమాటికిన్
గన్నులఁ జూడు మల్లుఁడను గానఁటవే యన రాధ యిట్లనున్. 64

సీ. పసిబాలుఁ డందునా పరికింప నూరిలో, నీవు జూడనియట్టి నెలవు లేదు
పగఁ గానవందునా మగఁడు నీవే యని, నీరాకఁ గోరని నెలఁత లేదు
వినవేర వందునా విద్యలయొగగల్లు, నీ వెఱుంగనిపాటి నీతిలేదు
దయఁజూడ వందునా ప్రియముతో నయముతో, నీవు లాలింపని నెలఁత లేదు

గీ. అన్నిటను జాణవే యౌదు వైన నాదు, కూర్మి నెఱుఁగనిదొక్కటే కొదవ నీకు
నీకు నీయంతఁ దోఁచని నెనరు కలిమి, వచనరచనలఁ దెల్ప నెవ్వరితరంబు. 65

ఉ. పెంచినదాన నంచుఁ దలఁపించెదు సారెకు సారె నీదు ప్రా
పెంచినదాన నౌదు నిది యెన్న రహస్యము మావిపిల్కలన్
వంచనలేక పాదినిడి వారక పోషణచేసి పెంపు గా
వించుట తత్ఫలం బనుభవింపనొ యన్యులపాలం సేయనో. 66

మ. వినరా వావుల కేమి కాముకుల మున్ విన్నాము కన్నాములే
నినుఁబోలంగలవానిఁ గాన మవురే నీ నేర్పు లోకంబులే

ల్లను గల్పించినధాత భారతికి యేలా లోలుఁడై వావి గ్రొ
క్కొనఁడాయె న్నిటువంటిసామెతలు నీకు న్నాకుఁ గానున్న వే.

ఉ. లేదని యుండినన్ ఫలము లేదని దైవము దూర నేల? నీ
కే దయ రాపలెన్ వెనుక నీవె తలంచుక చేరఁదీవలెన్
కాదని పైకొనన్ వరుస గాదని నిన్నద నమ్మియుంటి నీ
వే దయలేక నన్నుఁ గడకింతఁ దప్పుటఁ జెంతఁ జేసెంగితిన్.

శా. ఓహో యుత్తను నంటుచేసి నతఁ డాయుష్మంతుఁ డౌనంట నా
యూహాలోకము పోయె తాయె నన వేదోక్తంబు గాదందువే
నాహా మంచిది భూమిసామికిని నాశై యుండి యత్నోట సం
దేహంబా యిది వేదమందె వినవా నీమాట నీకే తగున్.

ఉ. ఎన్నఁడు పెద్దవాఁడవును వెన్నఁడు జాణతనంబు నేర్చి నీ
వెన్నఁడు నామనంబు ఫలియింపఁగఁజేయుదు వంచు గోరి నే
నున్నది వల్లవీజనుల యుల్లముఁ జల్లగఁజేసి మెచ్చుకొం
చు న్నవవింటివానిపని చూటలు పెట్టుట కా మనోహరా.

ఉ. భామనాసాచితాంగ పరిపుల్లసరోరుహనేత్ర నీకు సం
తోషము వచ్చినప్పుడె ననుం దయఁజూతువు గాక యూరకే
దోషములంచు నవ్వితలఁ ద్రోయుట కేనిఁక మాన నీవపు
ర్వేషవిలాసమును ధరించెద ముక్కుచపర్వతంబులన్.

క. విను కాకుండిన వేళొక, తనువున నినుఁ బెట్టుఁబుట్టుఁదలఁచెద నపుడున్
వినవేమిం వావివరుసలుం, తనువులకర్మంబో జీవధర్మమొ యెప్రభూ.

వ. అనిన నవ్వాలికామణికి గోపాలచూడామణి యిట్లనియె.

ఉ. బ్రమ్మకు యెన్నిపల్కుఁదన కానివిపోనివి గుంపుసేసి వే
దమ్ములు నీతులుం దగవు ధర్మము శాస్త్రములున్ స్మృతుల్ పురా
ణమ్ములు నీకుఁ జిక్కినయినన్ వినువారికిఁ జిక్కునా యని
పమ్మకు లూరివారలకుఁ జాటవలెంగద కేఁడు ముందుగన్

ఉ. మంచితనాన వద్దనినమాటలు నీకగపోఁత లయ్యె నా
నంచు భవత్ప్రియంబునకునై వినివంగొని గాదిదేల నీ
కించుకవల్ల నేమి యొకయించుక వావి దలంచుకొమ్మ మ
న్నించుము నన్ను మెచ్చుటయు నేస్తముఁ జాలదె రాధకామినీ.

ఉ. వెంటనె పాప మేల యవివేకము గట్టెదు వావి గాదు వ
న్నంటవు మన్న అంతులిడి యల్లువిముంచితనంబు లేదు పో
మ్మంటివి యత్తనేయుపని కాఁబడి లేదను టే నిజంబు నీ
వంటియభిజ్ఞురాలి కిటువంటివి యుంచి వొకో తలంపఁగన్. 76

గీ. అవనిఁ గాంతలు స్వేచ్ఛావిహార లగుట, తెలిసియే కాద బ్రహ్మ విధించినాఁడు
మగువకొక్కఁడె మగవాఁడు మగఁడుగాఁగ, రాధ యిది ధర్మశాస్త్రవిరోధ ముగద.

వ. అనిన గోపాలగ్రామణికి రాధికావధూమణి యిట్లనియె.

క. మహిదేహ సుఖ మెఱుంగక, తహతహపడి పరసుఖంబుఁ దాఁ గన కిహమున్
నహి పరము న్నహి యైతే, సహజను యామగనిఁ గొల్వఁ జలమో ఫలమో. 78

మ. గతి వీడంచును బిన్ననాఁడు తమవేడ్కన్ బెద్దలొప్పింతు రి
వ్వతికే కివ్వఁడు మగండు కానరు మనోవాక్కాయకర్మంబులం
బతి యెవ్వఁడని తోఁచె వాఁడె పతిగా భావించునాలే పతి
వ్రత నా సమ్మతి మీమతంబు చెడుతోవన్ బోవ నే వెట్టినే. 79

క. ఒక్కటి గల దైన మనో, వాక్కాయములందుఁ బెద్దవారల త్రోవన్
ద్రొక్కక మక్కువ నొక్కఁడె, దిక్కని దక్కినదియే పతివ్రత తలఁపన్. 80

క. మగఁడు మగండని మగువలు, తగవులు నడపినను గాక తమ రొల్లనిచో
నగుఁ గా దని దండించునె, తగవున ధర్మాసనమునఁ దగి మగఁ డోహో. 81

క. నిను నాఁ గాదన నేమో, యన పెఱతను గాని మిగిలినందులకై తే
ననువారు వీరు నాఁగా, దనఁగాఁ బనియేమి యొకరికై బ్రతికెదనే. 82

చ. బుడుతవు నీ వసడ్డతనముల్ బచరించెదు బుజ్జగించి నే
నడిగినఁ బాపమంచనెర వంతికు నీకుఁ బనేమి నీకుఁ గా
బడిబడి బాలనాఁడు మతి పాలను నగ్గిడునాఁడు నుగ్గునున్
నడపుచు నేనె పెంతునట నాకు స్వతంత్రత లేకపోయెనే. 83

చ. పలుకుల కేమి యేదగిను బల్కఁగఁజాలవు నిన్ను మించి యు
క్తులం పచరింప జాతరమె తొల్లిటివారలయాడికోలుమా
టలెకద పల్కఁబోయిన నొదంబడికల్ పనిగావు నాపయిన్
చలమొ ఫలంబొ యేల కరసానలబట్టెదు మాటికింబులన్. 84

ఉ. పాపము పుణ్య మేర్పరుపఁ బాల్పడినాఁడవె నీవు నీకు నీ
పాపము లేల నీకొఱకుఁ బైబడి దీనత నొందజేసె నా

పాపము నిన్నుఁ గూడఁగలభామల కబ్బెను బుణ్య మిందుపైఁ
బాపము పుణ్యముం గలదె భావమునన్ బరికించి చూడఁగన్. 85

మ. ఏ నామాటలు పూర్వపక్షములుగాఁ బోనాడి పోనాడి యా
నా నీమాటలె నిల్పుకొంటివి నకి సిద్ధాంతంబుగాఁ జేసి నీ
తో నింకేటివితండవాదముల్ పంతంబు శిష్టు నెక్కేటికో నిగ్రహ
స్థానం బైతివి నీవి దెల్పుపలుకే శాస్త్రంబు తర్కింపఁగన్. 86

క. శృంగారపువిత్తవంటిది, యంగన కడుఁ బ్రేమచేత నానందముతో
సంగీకరించినం దగు, భంగంబున కోర్వఁగలదె భావజనిధి. 87

చ. లలితుఁడ నేను వంచు మొదలన్ జదివించిన దెల్ల నేఁటికిన్
గలిగెను గాళ్ళపైఁ బడినకామినిఁ గాదని వాదు వాదలన్
గలమగవాండ్ర కాళ్ళఁ బడఁగాఁ బడు పున్నదె మాటలేల నన్
నొలపునఁ గూడరా మనసులోనఁ గఁ జల్లనిమాటలాడరా. 88

క. అల్లఁత పైనందులకున్, జెల్లఁగ నుపకారమొకటి సేయుము నామే
నల్లఁ గడుఁ గ్రాఁగుచున్నది, చల్లనిరీమేన నొత్తి చల్లార్పు మిఁకన్. 89

గీ. నన్నుఁ దాఁకినపుడె నా మేని కాఁకలు. నిన్ను సోఁకు ననుచు నెన్న వలదు
నిన్ను సోఁకఁబోదు నిను మున్ను గూడిన, మందపగులతనువులందుఁ గాక.

చ. ఇపుడు మదీయవాక్యముల కేమనెదో యని డెందమూరకే
తెపతెపఁ గొట్టుకొడెదిఁ బదింబదిగా నిదె చూడు మంచు న
చ్చపలమృగాక్షి లేచి యలసారసలోచను కేలుఁ దమ్మి నం
దపుటురమందు మోపుకొని తల్పు బరాలన మూని కృష్ణునిన్. 91

ఉ. గొబ్బున శయ్యకున్ దిగిచి గుత్తపుటబ్బురపుబ్బుని బ్బెపుం
గుబ్బ లురంబునం దలమి గ్రమ్ముచు మెచ్చుచు మోవితేనియల్
జొబ్బునఁ జాలఁ గాఁగొనుచు సొక్కుచు ముద్దులఁ గొల్లలాడి త
బ్బిబ్బయి కొంతసేపు చెలి ప్రేమ నదేమనుచున్ వచింపఁగన్. 92

గీ. అత్త మల్లాదునప్పు దయ్యంబు జాత్తుఁ, దూరకుండుట సరిపోలకుంట గాదు
పరవశత చేత నేమియు బదులుఁ బేయ, మనసులోఁ దోచకుండిన యునికి గాని. 93

సీ. మొదలఁ బుక్కిటివిడె మొసఁగి యెంగిలి గాదె, మంచిదిమ్మనుచు నిప్పించుకొనును
తానె గుబ్బ లురంబు నాని దోసము ద్రొబ్బు, మంచని కేలఁ బట్టించుకొనును
పలుమోపితిప్పారు బదులైనఁ బరికోర, మంచ కెమ్మోవి నొక్కించుకొనును
పరవశయై ప్రొక్కుమంచిడి సేఁ బెద్ద, సంచని మరల ప్రొక్కించుకొనును

గీ. ఒకట్రి చెలిగోర శౌరి దా నొకటిగోర, గొమరుప్రాయంపుధనముల్లఁ గొల్లలాడి
రిద్దఱును దోడుదొంగలై యింక మరుని, కేళిలంచంబు నిత్తురో యెఱుఁగరాదు.

సీ. కనుబొమల్ ముడివెట్టుకొని నీవు నే నంచు, శరుసవెంబడుల లైకవాదు లాడి
యాయతంబై నిల్చి యటు కేల నొడ్డుక, విరులబంతులతోడ ప్రేటులాడి
యాయముల్ దాఁకి హా యనినొచ్చి రోషాన, మురళించిగోళ్ళచే నఱకులాడి
కెరలి చేపట్లైనఁ గ్రిందు మీఁ దయి పోర, దిగువుతో సందీక పెనఁగి కూడి
బడలి సొక్కుచు సోలుచుఁ బాన్పుమీద, బడుచు లేచుచు మరలఁ బైఁబడుచునుండి
రిద్దఱును గొంత సేపు పెన్నుద్దులగుచు, జిగురువిలుకానిబిరుదు మాప్పిలసంగ. 95

వ. ఇట్లు పెనంగుచు ననంగసంగరారంభమున నిద్దఱుం జొరక యగరుఘుమాఘుమంబుల గుబులుంకొను కమ్మకస్తూరితావులం బొనుగువడి కొంతవడిఁ జిత్రరూపంబులకైవడి గదలకుండి రంత నగ్గోపికాకాంతునిం గవయుతమకంబున నక్కాంబుకంఠి యుట్టట్టు గొట్టుకాఁదుచు నతఁడు గదిసినఁ గదియనీక యవాంతరలజ్జాభరంబున దాఁపురంబులం బెట్టుచు నటిటు గుట్టునం జెట్టాడి బట్టినం దట్టిపెచి యెయ్యనొయ్యనం బయ్యెదకొంగుఁ దిగిచి యుబికిపచనుమిట్టల కట్టకేలకుఁ గేలుసాచినం బట్టిక చిట్టాడుచు పట్టువిడుపుల చిట్టకంబులను వేగిరింపక యేమఱించి లాలించి కౌఁగిలించినం గృష్ణుండు గదిమియదుముచు, నుదుటుసిబ్బెంపుటుబ్బు గబ్బిగుబ్బ లురమ్మునం గ్రుమ్మి సొమ్మసిల హా యని కనుదమ్ములం దేలవైచుచు, మోహంపువగలను మోము మోమునం జొనుపవచ్చినం దప్పించి యొప్పక యవ్వల నివ్వలఁ ద్రిప్పియబ్బిన యొడలం గొబ్బునం జొబ్బనఁజాఱఁగా వాతెరఁ గ్రోలిన నఱగన్నువైచుచు తేండువడి మునింగి విడువిడు మని విదళించి బదులుతెమ్మని పెదవి మొదలానం బోదివి యాని నాలుకచేఁ బైపైఁ బెణకుచు, చూడకుమని డాకేలఁ గ్రేగన్నులు మూఁగిచి నలకేలఁ జనుముక్కులు పులిమి బలిమిం దక్కితివని నురుక్కునం జాక్కుతేర్పడ నొక్కుచు, మక్కువను గోటిఁసోకులం బొక్కిలి నిమిరి యావ్వలఁ దడవఁగడంగినఁ దడంబడుచు, మెడబలిమితనంబున మోహారంబుగ దేహంబు లాహిరింగొను తెఱంగునకుం గఁలగి కన్మొగిచి నగుచు, నఖంబులఁ జెక్కిలి మీటుచు, తెమ్మతెమ్మని కమ్మవిల్తునికేళికిం బయికొల్పిన మెలఁతువలం గవకవలు చివులం దవులం జొనిపి తనివిదీఱక విడివడక యొకటెల్లం గలయం గరఁగించితి వేడ్క నేర్చితి? నన్నాతిమీఁదఁ పరాకునం బడలితి? వలసితి, విద్దిరా సుఖానందం, బిదిరా వింతచందం, బని పయ్యెదకొంగునఁ జెమట తడవెడం దుడుచుచు, బొమలు ముడుచుచు, నన్నుం జూడకుమని చివుక్కునం బయికొని యంతకంతకుఁ గందుకంబాడు కైవడిం దూఁగాడుచు, మఱియునుం బాతరలాడుకీలులం గులుక్కుచు, నల్లనల్లన లకుముకి

వ. అనిన నవ్వాలివృత్తాంతంబుఁ జెప్ప మనుటయు.

శా. వీక్షామాత్రఫలప్రదప్రళయకావేరీ మహాపట్టణా
ధ్యక్షా! శంకరపద్మనాభరఘునాథామాత్య గోపాలకా
దిక్షేమంకరసోదరాగ్రజపదాత్మీయాఢ్య! వాఙ్మంజరీ
సాక్షాన్నందకుమారపాదయుగ పూజాలబ్ధ భాగ్యోదయా!

క. గంధేభగామినీకుచ, గంధాంకితవక్ష! భాగ్యకలితకటాక్షా!
బంధురహయసింధురజయ, బంధురనయకీర్తి! వంశ పావనమూర్తీ!

తరల. మధురభాషణ! మంజుభూషణ! మాన్యసజ్జనపోషణా!
కధితపర్తన! కీర్తినర్తన! కాంక్షితాచ్యుతికీర్తనా!
ప్రథితలక్షణ! బంధురక్షణ! భాగ్యదాయకవీక్షణా!
మథితఘోరవిపక్షసార! విమానితస్థిరభారవీ!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ శృంగార కవిత్వవైభవ
వెలిదిండ్ల తిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకట
పతినామధేయ ప్రణీతంబైన రాధామాధవ
సంవాదం బను మహాప్రబంధంబునందుఁ
బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# రాధామాధవసంవాదము

## ద్వితీయాశ్వాసము



౧. శ్రీమత్సమస్తసద్గుణధామా! రామాభిరామ! కౌండవకృష్ణ
స్వామిపదాంబుజదాసా! శ్రీమగదలరామదాస! చిత్రవిలాసా!

౨. అవధరింపుము జనకధరాధిపతికి, ముదిని సంతోష మొదవ సన్మౌనితిలకుఁ
డైనశుకయోగి గోపాంచితాంగుఁ డగుచు, నవలికథయెల్ల నిట్లని యానతిచ్చె.

౩. అమరఁగఁ గార్యబద్ధములయందుఁ బరాకయి రాధికామనో
రమణుఁడు కొన్నినాళ్ళు మధురాపురిలో విహరించి యంత భ
ద్రముగ సముద్రమధ్యమున ద్వారకయన్ పురమున్ ఘటించి రా
జ్యమునను సాధుఁడై సకలసంపద లందుచు నొప్పె నప్పురిన్.

౪. కులమెల్లను రక్షించెను, దలిదండ్రుల చెఱలం బాపి తాఁ బోషించెన్
భళి! యిటఁ దగదె "సుపుత్రః, కులదీపకః" యనెడుమాట గోవిందునకున్.

౫. ఏవగవారు చేరిన సహించి తనంతటివారి, జేయుచున్
దైవము దాత తల్లియును దండ్రియుఁ దానయి ప్రోవఁగా జగ
త్పావనమూర్తి యా తనయుఁ బావనమౌతను గన్నదేవకీ
దేవినిఁ దన్నుఁగన్నవసుదేవుని సాపదఁ బాపి ప్రోచుటల్.

౬. పదిరెండేండ్లగుప్రాయమందు నిటు గోపాలుండు భూపాలురన్
మొదలన్ మీఱఁగనీక లోఁగొనుచు రుక్మిణ్యాదులన్ గన్యలన్
బదియార్వేల వివాహమై సగుణరూపప్రఖ్యమై కన్నవి
న్నదిగా దీమహిమం బటంచు ఘను లెన్నంగాఁ జెలంగెన్ మహిన్.

౭. ఈవగ సమస్తభాగ్యము, దైవవశమై నిండియుండఁగా సైఁపక యా
గోవిందుడుఁ రాధపయిన్, భావంబిడి కందుఁ గుందు బరవశ మొందున్.

౮. డాయఁడు వనితామణులన్, పాయం డొకగడియమాత్రమును గను చెప్పల్
చేయఁడు చక్కఁగ భోజన, మీయఁడు తనమనసునమర్మ మెవ్వారలకున్.

సీ. పెనఁగుచో రుక్మిణి మునువలెనీదు మే, నత్త, లేదని పల్కు వలసినప్పు
కథఁ జెల్పుమన సత్య గాథ రాదని పల్కు, నదిగాక విననని యసురుసురను
మరుమాట దెల్పు జాంబవతి నా నీవల్ల, వింటలేదని నీరు కంటనించు
రతివేళఁ గాళింది నుతియించుచును నాథ, రాయనఁ బ్రేవాలు హా యటంచు

గీ. బలిమిఁ బదఁతులు పైఁ బ్రక్కఁ బడెడు వేళ, నోడుమమాటల వ్యంగ్యముల్ దడబడుటలు
చదురులును సంధి సేర్పులు వెదకి చూడ, రాధ తలఁపైన మదిగుందు మాధవుండు. 9

చ. పయికొని పువ్వుఁబోండ్ల బహుభంగులఁ బ్రార్థన చేసి వేఁడినం
గయికొనఁడాయె శౌరి తనుఁ గానక రాధిక యెంత యుబ్బసం
బయిపొరలాడునో యనుచు నాత్మను జింతిలు నట్టివారికిన్
దయయొకచోట నుండిన వితావిత యెంతవివేక ముండినన్. 10

చ. ఒకరికిఁ దెల్పరాదనుచు నూరక చింతిలుఁ గొంతసేపు కా
దొకరికిఁ దెల్ప మంచిదని యుద్ధవుతోఁ దెలుపంగఁ బోవు నే
నొకరికిఁ దెల్ప రాధ యిటు లొక్కరి కేటికిఁ దెల్పెనంచుఁ దాఁ
దకపికలాడునంచు మదిఁ దాలిమి వీడును వేఁడు దైవమున్. 11

వ. ఇవ్విధంబున బహువ్యధలం బొందుచు నెందునుం బ్రొద్దునోక దేవకీనందనుండు తన ప్రాణసఖుండగు నుద్ధవునికై దండఁగొని మంద మంద చరన్మలయపవమానకంపితాధంగ భంగ నటత్కలక్వణితరణిత కలహంసకారండవ ప్రముఖప్రత్త్రికులగోత్త్రి కులపత్ర వాతోద్ధూతాంబుజాతజాత పరాగరాగకషాయిత కషాయకాసార రంగత్తరంగ కణోద్ధూత జలకణ పరంపరాపరితోషిత మందార మాకంద చందన పిచుమంద కుందసింధువార తాలహింతాల తమాలమాలతీ తక్కోల సాలరసాలచంబు జంబీర ఖర్జూర కరవీర సహకార పున్నాగ నాగవల్లీ మల్లికా పుంజరంజిత నికుంజ పుంజమంజులవివిధ కుసుమ భాసురవాసనాభిరామం బగు నొక్క కేళి కారామంబుఁ జేరి యందు నింద్రనీలసాంద్ర కుట్టిమప్రాంత ప్రవాళ స్తంభసంభూతకాంతి విభ్రాజితజాత రూపమయ కుడ్యనిబద్ధ పద్మరాగచ్ఛవిచ్ఛన్న మరకతశిలామయ ముక్తముక్తావితానవిలాస వాసచతుష్కరాంగణ కాంత శశికాంతమయ వేదికాతలంబునఁ గూర్చుండి కొండొకవడి యూరకుండి నలుదిక్కులుం గనుంగొని యుద్ధవుం డాయరమ్మని యీమర్మం బెన్నఁడేనియు నీవు వినియుందువే యని గోవిందుండు మందహాస భాసురముఖారవిందుండై యిట్లనియె.

ఉ. ఇద్ధరకెల్ల రాజనయి యెక్కడ లేని ప్రసిద్ధిఁ గాంచి నా
బుద్ధికి నీడు లేదనగఁ బొల్పువహించి తలంప నేమిటన్

నొకటి సేయఁగఁబోయి యొకప్రయత్నము సేయు, మంచిదౌనటంచు మదిఁ దలంచు
నొకటి పల్కఁగఁబోయి యొకటి యేమేఁ బల్కు, మోసమాయెనటంచు మోము వంచు

గీ. మారు నందించునది తోఁచ కూరియుంచు, బయలు గబళించుఁ బలవించుఁ బల్కరించు
నిజము గాదంచుఁ గన్నుల నీరునించుఁ, గలకలను నుంచుఁ గలఁ నుంచుఁ గలవరించు 45

గీ. బయలు వెడలంగఁజాలదు భయము చేత, నిముడుకొనియుండఁజాలదు భ్రమము చేతఁ
గలికి యప్పు డోదమునఁ బడ్డ హరిణి కరణిఁ, దొట్రుపడి కొట్టుకాడును ద్రొక్కులాడు. 46

సీ. మధుకైటభారాతిమధురవాచారీతి, నొంటిగాఁ జింతించు నొక్కవేళ
పీతకాంబరధారి యదె వచ్చెనని చేరి, యున్నట్లు బయలాను నొక్కవేళ
పాథోధిశాయిపైఁ బదము పాడఁగఁబోయి, యూరక శోక గొణఁగు నొక్కవేళ
మనమునఁ బేర్కొన్న మర్మకర్మములకు, నుదుకుచు వెతనొందు నొక్కవేళ

గీ. దిక్కులేదని విధిదూఱు నొక్కవేళ, ప్రొక్కి దయఁజూడుమని వేఁడు నొక్కవేళ,
నోయదూద్వహ యని చీరు నొక్కవేళఁ, దా మఱి కలంగి రాధికా కోమలాంగి 47

గీ. మఱియు నొకయింత శయ్యపై మఱవు లేక, బాధపడి గాధ తడఁబడి బడలి నిల్చి
పిల్చి తోయజాక్షిఁ బ్రలాపింపఁదొడఁగెఁ, గృష్ణు గుఱుతూర్చి చెక్కునఁ గేలు చేర్చి 48

క. హా కృష్ణ ! హా యదూద్వహ !, హా కేశవ ! హా ముకుంద ! హా గోవిందా !
హా కమలనయన ! హా హరి !, హా కమలాహృదయలోల ! హా గోపాలా ! 49

మ. నిను నాదైవముగా మదిం దలఁతు నీ సిద్ధంపు సెమ్మోము నీ
గొనబుం జెక్కులు నీసుధాధరము నీ గోష్ఠైన సౌమ్యమునుం
గని యుప్పొంగుచు నాతపఃఫలముగాఁ గైకొందు నేఁ దయ్యరో
నను నేలా విడఁ బాయఁజాలితివి కృష్ణా ! యెంతనిర్మోహివో. 50

మ. ఒకనాఁ డించుక చూడకున్న నిను నాఁ డూరెల్ల నేడే మొకం
టికి నిస్సారముగాఁగఁ గానఁబడు ; నా డెందంబు నిన్ జూచినం
దుకె ముల్లోకముఁ దానె యేలుగతి నొందుకె సంతసంబందు ; నేఁ
డకటా యేమియు లేక నీవు ననుఁ గృష్ణా ! యింతగాఁ జేయుదే. 51

ఉ. అక్కట యెన్నిముచ్చటల కాసపడుంటి మనంబులోనఁ దా
నొక్కటి యెంచ దైవ మది యొక్కటి యెంచుట సత్యమాయె ; నీ
యక్కునఁ జెక్కుఁ జేర్చుకొననైతిని నా కిది హానమాయె న
న్నొక్కఱము పాయకుండువని నిన్నెదనమ్మితిరా మనోహరా. 52

కదియక నీమువారిచలెఁ గన్నులఁ జూచినవేళఁ గొంకనే
వది యిది ప్రొద్దుపోకలవిహారము సల్పిన నింత రాదుగా
మొదలను దూర మెంచవలె మోసము వచ్చెఁ గేమిసేతు నా
మది మదనుండి యేల నిను మాలిమిచేసితి జీవితేశ్వరా. 53

అనించి నీవు చేసిన, బాసల నే నమ్మియున్న పసిగోల నహో
దోష మన కింతిలో మది, రోసితి వింతటిదయాపరుండవో కృష్ణా. 54

అని విలపించి నీవు విడనాడిన నెవ్వరిదాననంచుఁ గా
మిని మొగమందు చేల యిడి మిల్లని యేడ్చెను వెక్కి వెక్కి వా
ల్గనుఁగవ వెచ్చనీరు చిఱుకాలువలై ఱయికంటె నిక్కుచ
న్గొనలను జాఱఁగా మెయి గగుర్పొడువన్ మది తాల్మివీడఁగన్. 55

అంతఁ బెంపుడుచిల్క యయ్యతివఁ జేరి, యక్క యదియేమిచేసెద వరుకుచీరి
చెలులు వినిరేని కెందుకే చింతఁగొంద, వలదు కృష్ణునిపదమాన నిలువు మనిన. 56

కనువిచ్చి చూచి రాధిక, తనువేఁడెదుచిలుకతోడఁ దా నిట్లనియెన్
వినవే చిలుకా కృష్ణుఁడు, తనునొల్లని వెనుక నాదుతను వేమిటికే. 57

ఇల్లేటికి మగఁ డేటికిఁ, దల్లేటికిఁ దండ్రి యేల ధన మేటికి నా
యుల్లనిరూపము కన్నులఁ, జల్లనఁగాఁ జూడఁగనిదఁ జాలదె చిలుకా. 58

కల్లరి గాఁడు లో నెనయు గల్గినవాఁ డదిగాక వావి మే
నల్లుడు రూపవంతుడు మహాగుణశాలియటంచు నమ్మి నా
తల్లిని దండ్రినిన్ మగని దమ్ముల నన్నల రోసి తన్న నే
నుల్లములోన జేవు దనియున్నది కీరమ నీ వెఱుంగవే. 59

వీథులలోన తవగవు వెన్నెల చల్లఁగఁగాయఁ బూర్ణచం
ద్రోదయమైనరీతిఁ గళలూనినవాని మొగంబె గాదిగ
న్నాదిగుతల్లిఁ దీఱఁ గని నాదిగదా తగుభాగ్య మార నా
మీఁదను స్వామి కంతదయ మేలుభళా యనుకొందుఁ గీరమా. 60

చందురునిఁజూచి సంతోష మందులీల, జూచి పొంగును వారి నిధి చూడలేక
యమ్మలక్కలు మిన్నక యాడుకొంద్రు, కేల కోఱ్ఱెము నిందల నేమిగంటి. 61

దలమున మచ్చుతల్లిన నిజాంకమునున్ దయవాఁడటంచు నే
వలచితిఁ గాలకింకుసుమవాసనకై భ్రమరోంది తేనెలో

వలఁ గలదంచు నానఁగొని పైఁబడఁ బుష్పవిశిఖుం డెందుకన్నులం
దొలసిన లేవలేక పడుకుమ్మరతో సరియైతిఁ గీరమా. 62

చ. మది మగిడుండలేక బలిమాలిన నామది నాడికొందునో,
కొదవలు గాఁగ నాడుకొను గుంపుల నందునొ, యింత కోర్చు నా
బ్రదుకున కందునో, వెతలఁ బాల్పడజేసిన బ్రహ్మ నందునో,
యది యిది యేల నావలపు లాఁతిఁ బెట్టిన శౌరి నందునో. 63

ఉ. ఎన్నటికంచు సేవగతు నిప్పుడు నాతలఁ బ్రాఁత యేసి గా
నున్నదొ యింతటంతుపడ నోర్చినదానికి నింతచందఁగా
నున్నదొ కానిపోనితగు లానిననామది కేమిసేతుఁ గా
నున్నది కానఁబోవదని యుండదు నెమ్మనం బికన్. 64

మ. అనుకోరాదని కాక యేమిచిలుక! నా శ్రీశౌరి యూరెల్లఁ జో
యనుకాలంబున నేఁగఁలం బోవఁగని యన్యాసీనతం జెంది నేఁ
దనుఁ బ్రార్థించినకొద్దిఁ దాఁటిగియ వంతం జింత నంతంత యిం
తనఁ గారాని విరాళిపాలుపడి లోనైయుంటి నన్నింటికిన్. 65

క. నేఁడైన వానియాసల, పోఁడిమి విడనాడి నేను పొలిసెదనన్నన్
వాఁడి చెడినాఁడు మారుం, డాగ నితని శేల పువ్వుటమ్ములు విండ్లున్. 66

చ. అనుచు ననంగునింగుతించి యంగనలన్ మము నొంపఁ గాని తెం
పనుగొంటగావు నీరొదలం భస్మము గా మగవారిఁ జేరనుం
జెనకఁగలావె లావుగల చిల్కగుఱ్ఱాని బిరానఁ జేరి నీ
గ్గున బ్రతుకందలంపు మదిగో యిఁక నెన్నకు బంటుపంతముల్. 67

క. దమయంతి రాముని౦తిని, బ్రమయించినరీతి వట్టిభ్రాంతిని నన్నుం
దమి మాంచకు మరు లెంచకు, కుమిలించకు పువ్వుటమ్ముఁ గుదిలించకుడన్. 68

గీ. అని యనంగుఁడ వీవు నిన్ననఁగ నేమి, నేమిరీతిని నెలనోఁచె నింగి నిండు
నిండుఁ బగఁజూడు మని మళ్ళి తీవుగాక, కాఁక నను యుండలేవని కలికి యనియె

సీ. పశ్చిమాచలము పైబడిఁ మళ్ళి బ్రతుకుదే, లలిఁజూపు నింద్రజాలంబు గాక
యిలఁ జకోరములు వెన్నెలఁ గ్రోల నెగడుదే, వగఁజూపు కరలాఘవంబు గాక
దినదిన మొకవింతతీరుగాఁ దోఁచెదే, వెదమాపు బహురూపవిద్య గాక
రాహువు మ్రింగఁ గోటులు పోకి వెడలుదే, వెదవెడఁజూపు గారడము గాక

క. పొమ్మనవలె; నన్నిఁకఁ, బొమ్మనవలె; నీవు పోయి పురుషోత్తముతో
రమ్మనవలె; దేహమునీ, సొమ్మనవలె; విడువవలదు సమ్మానవలయున్. 81

మ. తను భోగింతుఁ, దను వ్వరింతు ననుచింతం గాదు పోయింక సా
పని నాకేటికి; సిగ్గుచేద తొలుతన్ బ్రాయిండి యుల్లాలిఁ గా
వునుగాఁ జేసి తుదిన్ ద్యజించి తిరిగె పుణ్యాత్ములం జూచిరం
తని చాలున్ ఫల; మీశ్వరేచ్ఛ యెటులైనం గాని యామీఁదటన్.

మ. తనపేరుం దనపల్కులుం దనవగల్ తా నాడెదం జేయుచు
న్ననయు న్నెమ్మది నాఁటియున్న దిఁక మానంజాలఁ జింతాభరం
బున డెందంబున గ్రాక్కుటన్ విరసమున్ బుట్టించి పోఁ గాని ర
మ్మనవే యొల్లనివాని కేల యితరవ్యాపారచాతుర్యముల్. 83

ఉ. ఇంగితమెల్లనుం దెలియ నేఁతయు జాణవు నీవు; నీవచ
స్సంగతి యేరికిం గలదె; సన్నుతిగా దిది శౌరి జేను ను
ప్పొంగుచుఁ గూడినప్పటికిఁ బొల్పుగఁ దోఁచును నిన్ను మెచ్చఁగా
బంగరుచిల్క; నిన్నిపుడు పల్కఁగ నేర్తును పెదపల్కులన్. 84

గీ. అనుచుఁ దన చేతివ్రాలఁ బద్యములు రెండు, వడిగ లిఖియించి రెక్కలనడుమ నునిచి
చిల్క! నీ చేమి తెల్ప నీచిత్తమిఁకను, దనదు భాగ్యము పోయి రమ్మనుచు నంప. 85

కం. గగనమున కెగసి మధురా, నగరముఁ గని యచటఁ గనుల నాథుఁడు లేమిన్
దగఁ దెలిసి ద్వారకాపురి, డిగి యచ్చటింగరు సొచ్చి డెందం బలరన్. 86

క. తమకమున భోజకన్యయుఁ, గమలాక్షుఁడుఁ బదుకటింటఁ గనఁగోని యుండన్
సమయము గాదని యచ్చట, నమరినచిలుకలను గూడి యాడుచు నుండెన్. 87

వ. అంత. 88

మ. తరుణసంతతుఁ జెక్కడంపుఁబనినిద్రాజాలవాకింబొ
మ్మలు వల్వంకల నాడికం పునదగుమ్మల్ గాఁ బనుల్ సేయఁగాఁ
గులుకుంబవ్వలకొల్వఁ జంచముపయిన్ గోపాలుఁ డారుక్మిణీ
లలనారత్నముతోడఁ గూడి పొలయల్కన్ మార్గ్ముగం బొసఁగన్.

మ. చిలుకం జూచి విరాళి రేఁచి నగుచున్ జేసాచి రా రమ్మరు
ద్దులగా రాబుమిటారిచిల్క యన నెంతో వేగఁ బాదాంబుజం
బులపై వ్రాలఁగ కేల్సాఁచి దిగిచి యుంపుల్ గుల్క ముద్దిచ్చి రె
క్కలఁ జక్కంబడదువ్వుచు న్నిజవృషాంకంబందు లాలించుచున్. 90

మ. ఘనయోగీంద్రులనీతి నేమినినిదుర్ ; కంసారియుం దా నేమిగ
నన్ను ; నెమ్మనమున నేమినొసఁగినను ; కృష్ణా ! దేవకీనందనా !
యనిపల్కున్ ; జెలిప్రేమ నేమనుదు నాథా ! హా హా మోహజోహా ; నె
మ్మనమారార ; వికార సుందరిరా మందారపుష్పాకృతిన్ . 102

క. ఆపదఁలి చేతఁ బెరిఁగిన, పాపంబున బాదుపల్కు ప్రత్యక్షము గా
నోప దయిన నీసేవలం, బ్రాపించుటఁ గొంతికొంత పాటింపఁదగున్. 103

చ. ఘనకుచపాళి పాళి నినుఁ గస్తురిచేఁ గొనగోటఁ వ్రాసి యి
య్యనువున నెన్నఁడుందు నకటా యనుచున్ దలపోసి పోసి వె
చ్చనికనునీరు పై పయిని జాఱఁగ బాలవాని చే చుఱు
క్కన విదళించి యెంతఘనమారయెను జీవమటంచుఁ జింతిలున్. 104

క. ఇక్కమ్మలోన నేమో, గ్రక్కునఁ దా వ్రాసి యునఁగెఁ గైకొను మనుచున్
జెక్కుల నుంచినపత్రిక, ముక్కున నిదలించి శౌరిముంగల నిడిరెన్. 105

క. పురుషోత్తముఁ డాపత్రిక, నిరుకేల నహించి మొదల నీయ వటంచున్
మురియుచు గన్నులనొత్తుచుఁ, దఱచుగదలయూఁచి చదివి దానిట్లనుచున్. 106

చ. సకలగుణాభిరాముఁ డగు శౌరికి రాధ నమస్కరించి మి
న్నక యొకవిన్నపంబు ; నిను నమ్మినవన్నియమున్ ఫలించె వ
త్తకు మగఁడల్లుఁడంచును వితావిత తేరకుఁ కెర వట్టియా
డిక లివి యేల నాకు నెగడెన్ నడి మాన్పుము మేలు నీకగున్. 107

వ. అని చదువుకొని తద్భావంబులు పలుదెఱంగులం బరికించి వాత్సల్యంబును ముగ్ధతనమును ప్రౌఢతనమును వ్యంగ్యంబుగఁ దోఁప వింతయుఁ జింతయు దొంతరగా నంతరంగంబునం గదురఁ గొంతవడి యూరకుండి యువ్వలం గనుంగొని యందు. 108

క. ... ... నిను మని మాఱవను
... ... నను నెనరు మఱచి కినియకు నాపై
... ... కనికరం ముంచర
... ... యని తలఁచినపుడె యొనపెద ననరా. 109

( ఇది గుప్తచతుష్పాదకందము. )

వ. అని చదువుకొని యది గణబద్ధం బయ్యును బద్యంబు గానివిధం బేమి యని యూహించి యస్తవ్యస్తమంబు ముందువెనుకల రచియించి పరిత్యాగలోభంబున మన్నా

స్వామి ముకుందుఁ డచ్యుతుఁడు వారిజనాభుఁడు శేషశాయి న
న్నేమనె ; నేమి చెప్పమనె ; నేమని పంపెను ; విన్న నేమనెనో .

క. అదియుండె నేను వ్రాసిన, పదపద్యములెల్లఁ జదివి భావముఁ గనెనా
బదు లేమి పంపెఁ దన్నని, పొదలుచు నాశేఖఁ గొనుచుఁ బొలఁతుక నగుచున్.

క. పత్త్రికల వ్రాయుజాణవుఁ, బత్త్రికలను వ్రాయు జీపు ప్రౌఢి యటంచున్
బత్త్రికఁ జనుగవపై విడి, పత్త్రిర్థము సొమ్ముఁ దమ్ము సత్రిక యనుచున్.

ఆ. చిలుకతోడఁ గొంతసేపు మాటాడును, మొదలుకొనినదాని మొదలుగాఁగ
నాల్గుచరణములును నాలుగువిధములై, తనయుపద్య మిట్లులనుచుఁ జదివె.

క. తలఁచినఁ గలఁపెడ రాధా, తల పసునుయుశరములను దలఁకకు రాధా
నెల నీకఁ దలఁపకు రాధా, కలచిలకలపలుకులకును గలఁగకు రాధా!

వ. అని చదువుకొని తచ్చాతుర్యంబునకు మెచ్చుచు నీపాటికిటుసంబున్న దే యశోదాగర్భరత్నాకరరాకాసుధాకరుఁడ కని తనపెంపుడు చిలుకను బ్రియంబుతోఁ బలుకుదువ్వుచు నీవల్ల నుల్లం బీపాటిచల్లఁదనంబున నున్నది. యగపులగత్నాకరరాకాసుధాకరా! ద్వారకాపురం బేకగతి నుండె నందలి వింత యేనందంబున నుండె నందు గోవిందుం డేయందంబునఁ గొలువై యుండె నంతయుఁ దెలియఁ బలుక వలయు నని రాధకావదూతిలకంబునకు ముద్దుచిలుక యిట్లనియె.

సీ. అష్టదిక్పరిచుంబితాభ్రంకషవిచిత్ర, గోపురం బల ద్వారకాపురంబు
మహిపదాంభోజాతమణిమయమనూనీయ, నూపురం బల ద్వారకాపురంబు
సకలవైభవభోగసరణిపరాజిత, గోపురం బల ద్వారకాపురంబు
కమలాంబకునిఁ గన్నకమలాలయకు నుండఁ, గాఁపురం బల ద్వారకాపురంబు

గీ. నీలపద్మమహాపద్మనిరుపమాన, విజయకరశంఖవరకుందవినుతమకర
కచ్ఛపముకుందశోభితఘనలసదల, కాపురం బగు నల ద్వారకాపురంబు.

చ. పురవరసౌధవాటముల బోటులపాటలఁ జంద్రకాంతముల్
గరఁగి ప్రవాహముల్ దివిముఖంబున రా వినువాఁక యంచుఁ ద
త్తరమున వేఁకువన్ సురవితానము తానము సేయఁ గ్రుంకుచో
"హరిరో హరీ" యటంచుఁ బరిహాసము సేయుదు రవ్విలాసినుల్.

చ. అల రెడివీటివజ్రమయహర్మ్యరుచుల్ దివిఁ గప్పఁ బుల్కలో
య్యలిఁ గనుఁగొంటి నంచు నవు డానరవాహనపుత్త్రివేశ్యలున్

మేదకుఁ దూర్పుపక్క నొకమేడ చెలంగఁగ శౌరితోడ నీ
వేదకు నెవ్వ రాధ్యులన మీపువుఁబోఁ డనిపల్కె నవ్వుచున్. 138

గీ. మఱువ మగరాలవనికి నీమగఁడు నేను, నీప్రసంగము లేద నానీద పార
నచట నొకచిల్క ననుఁ జూచినట్టులుండె, నవల నెవరన నెవరులే గనిగొని పోరీ. 139

చ. ఇటు ననుఁ బంపినన్ మొదట నే నటు వోయినఁ ద్రోవఁ దప్పి చీఁ
కటి నడిమిద్దెటెందఁబడి కాంతమణుల్ బయలంచు భ్రాంతిచే
నట నెగఁబ్రాఁకి తాకి తడవాడుచు గూడులవెంట దూరి రొ
ప్పటిపారిముంగలం బడి కృపన్ గడవెళ్లితి ద్రోవచూపఁగన్. 140

మ. ఒకకేల్గోపురమందు వింత గనుఁగో నూహించి యోహో పైన నిం
చుక కాలూనిన గిఱ్ఱునం దిరుగ నచ్చోఁ బోవరాదంచు బు
ద్ధికిఁ దోఁచెన్ మఱియొక్క వింత విను మాతీరంబునం దొక్క బొ
మ్మ కరం బెత్తి నిజాలకున్ బడఁతిగా మల్లాడుచు న్నవ్వితిన్. 141

ఉ. గోలతనంపుఁజిల్కయని కోమలి నవ్వకు ; నీవు ముందుగా
లేలవుగాక తప్ప దొక పెద్దహజారముఁగన్న వీఁడు గో
పాలుఁడు వీఁడు కృష్ణుఁ డను భ్రాంతిని జిత్తరుబొమ్మ లెల్ల నా
పోలికనున్నఁ బైఁబడక పోదువె ; తాళుము ; రేపె చూచెదన్. 142

క. నైచు మని పలుక రాధిక, యోచిలుకా యింత యేల యుడికించెదవే
నీచిత్తము నాభాగ్యం, బాచతురుం డెపుడు వచ్చు నని యడుగు నెడన్. 143

గీ. కొంద ఱాభీరపూర్ణ రాకేందుముఖులు, నగుచు నేమక్క విన్నవై నావు నీవు
మాటలేమన మఱి యేటిమాటలనుచు, నొకటిపైఁబెట్టు నిదె మాట కొకటియుండ. 144

వ. అనిన నవ్వలివృత్తాంతంబు చెప్పుమనుటయు. 145

ఉ. సింధుగభీర ! శీతకరశేఖరజూటనటద్వియన్నదీ
బంధురశీకరప్రకరపావనసత్కవితాధురంధరా !
సింధురగామినీనఖరచిహ్నవిభూషణభూషితోజ్జ్వల
త్కంధర ! నీతినూతనయుగంధర ! బర్హిణబంధుకంధరా ! 146

క. ఖరనఖరశిఖరముఖరిత, వరరవవీణాప్రవీణ ! వాణీరమణీ
శ్వరనారదహారదపారద, శరకీర్తివిహార ! కృష్ణసచివకుమారా ! 147

సులభధనదమిత్రా! సూర్యసంకాశగాత్రా!
ఫలితహరిసుపుత్రా! బంధుమందారధాత్రా!
కలితసుమవిధేయా! కాంతిపద్మాంతిరాజా!
లలితగుణసమాజా! లక్ష్మమాంబాతనూజా! 148

ఇది శ్రీ మాణిక్యాంగోపాల వరప్రసాదలబ్ధ శృంగార కవిత్వవైభవ వెలిదండ్ల తిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకటపతి నామధేయ ప్రణీతం బైన రాధామాధవ సంవాదం బను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు

# రాధామాధవసంవాదము

## తృతీయాశ్వాసము

శ్రీకరవరవైభవని, త్యా! కమలానాథమృదుపదాంబుజభృత్యా!
యాకారవిజితశాస, త్యా! కృష్ణాపత్యా! రామదాసాదృత్యా!

అవధరింపుము జనకధరాధిపతికి, మతిని సంతోష మొదవ సన్మునితిలకుఁ
డైవశుకయోగి రోమాంచితాంగుఁ డగుచు, నవలికథయెల్ల నిట్లని యానతిచ్చె.

అప్పుడు కృష్ణదేవుఁడు దయాంబుధి గావునఁ గావుమన్నచోఁ
గుప్పున నాగకేంద్రుకడకుం జనుదెంచినరీతి వచ్చెఁ దా
నెప్పటిగొల్లపల్లెకుఁ గవీంద్రులు గాయకులున్ సఖుల్ భటుల్
తప్పక వెంట రా రథము దారుకుఁ డింగిత మెంచి తోలఁగన్.

మునుపు తానున్నరీతులు మొదటికథలు, నక్కడక్కడ సఖులతో నాడుకొనుచుఁ
గనుచు నట గొల్ల లెవ్వరో యనుచు బ్రమయ, నడచి కృష్ణుండు నందునినగరు చేరి.

బడలితిరి మీర ; లిప్పుడు. విడిదిండ్లకుఁ బొండు ; మిమ్ము వెనుకఁ బిలిచెదన్ ;
దడసితిరి భోజనానికిఁ దడయక సేదలను దీరఁదగు మీరు వడిన్.

అని పలుకుల్ వినంబడినయంతఁ బడంతులఁ జేసదల్చుచుం
గనుబొమ నిక్క నంబరముఁ గన్గొనుచుం జెవి వ్రాల్చి కొంతసే
పున కిది శౌరిపల్కుబడి పో వినఁగల్గెనె యంచుఁ దత్తరం
బున దమకంబుఁ దాల్మిభయము న్మదము న్మదిలోఁ బెసంగఁగన్.

చిరచిరను సెజ్జమీఁదికి, నరిగి గవాక్షములఁ జూచి హరియే యనుచుం
బరికింప రాధికామణి, మఱియేమియుఁ దోప కపుడు బ్రమ్మపడియుండెన్.

అంత.

వచ్చెనా నాతండ్రి వాసుదేవుం డని, నందుండు వచ్చె నానందమునను
నాచిన్నపాపని జూచితినా యని, సొంపున జేరె యశోద ప్రేమ

క. గోపాలక మాటాడక, కోపంబున నుండ నెంచుకొంటివి మొదలన్
నా ప్రజ్ఞ నడవబోదని, కోపము నేనే శమించుకొంటిం బిదపన్.

ఉ. వేడుక నెత్తె నంచు రతివింతల నిన్ భ్రమియింపఁ జూతునో
మోడి వహింతునో భువనమోహిని నేనని నాకు రోయల పెం
డ్లాడితి వంచు బాధ్యతను నాడుదనో యిఁక యేమి యొందునుం
గూడని దానవై చనవు గోరద నెవ్వతె నంచు దూఱెదన్.

ఉ. మానుమ మెంచిరైన నొక మంచిత సానకుఁడైన నీవు పు
ణ్యావశు మాటలాడెదవు; శాతరమా నిను బల్కజేసి నే
స్నానకుఁ బిల్వ; నీఘనత చాలదె రాధకుఁ; గాక కాఁక చే
నే నొకటాడ నేటి; కది నీకు వసభ్యతఁ దోఁప నేటికిన్.

ఉ. దోసము కృష్ణ కృష్ణ నిను దూఱిన; నానొసలందు ధాత మున్
వ్రాసిన వ్రాఁత కాదనుచు వ్రాయఁగ నీవశమౌనె; నీవు నే
వేసట లేక యేరికని వేడుక చేసెదు పైని పైని నా
సాసల మాకుమేమె పయినాఁడుచు నిన్నన నేరమున్నదే

చ. ఎద నెదఁ జూడుమంటివో; పయిఁబయి నెమ్మది నిల్పుమంటివో;
గడెగడెఁ గోరుమంటివో, దగిలడుమంటివో, వేఁగుమంటివో,
బడలుమటంటివో; యరుచి పాల్పడమంటివో; సిగ్గు నెగ్గు లే
కడలుమటంటివో; పొరలుమంటివో; మూర్ఛమునుంగుమంటివో.

ఉ. ఒక్కతె భ్రాంతిచేఁ బొరల నొక్కఁడు మాన్పగఁ బూఁటకాఁడె? నే
నెక్కడిదాన నీవు మను పెక్కడివాఁడవు నాకు నీకు నే
మక్కరయున్నదైన నొక రాడెడిపల్కులు నేను బల్కెదన్
గ్రుక్కక; యారయేఁ బోరెయు నవి కొన్నిదినాల ఋణానుబంధముల్.

మ. మన మానాఁడు మహావినోదములఁ బ్రేమ ల్మీఱ భోగింపుట
ల్వాను మీనాఁటికి నిద్ద ఱొక్కరొకరిన్ వేసారుటల్ వింతలై
కనుపించెన్ రచియింపనేరిచి కవుల్ కల్పింప లోకానకున్
వినసౌ; నింతియుచాలు; మీఁదికథ లీవీనుల్ వినన్ లేవిఁకన్.

ఉ. అందుకు పైనిమాలి యొకయత్నము చేయకయుంటి నేని నా
యందుఁ బదాఱువేల కొకయంశము రాదు ధవత్కటాక్ష; మీ
పందున భోజకన్యకయు సత్యయుఁ దృష్టి వహించినంగదా
యిందఱిమీఁద రాధ యిఁక నేటికిఁ జాలదె జీవనానికిన్.

దైవం బెంతకు దెచ్చె? నీవలెపు లేదా నాఁటికి? నిన్నెఁటికిన్
ద్రోవల్ పుట్టెనె? నాఁటి దీగుణమె కాదో; నాఁటి విశ్వాసము లే
కావో? లేక యిదేమి; యీ నడత; నీ కైలాట; నీ మోసముల్;
నీ వాకృష్ణుఁడ నేను రాధ నెకదా నీ లేఖపత్రిక్షణా! 34

ఇన్ని దినంబులే బ్రతుకనెంచుట యేమిటికి కంటిలేని యీ
కన్నులదేమొ నిన్నుఁ దమకాంక్షలు దీఱఁగఁ జూడఁగోర; నే
నున్నది దేవుఁడుం దెలియకుండునె; దేవుఁడటందు నీకు లే
కున్నను మాఁకు బామరికి మున్నగి యున్నదినాలలోపలన్. 35

వంచన మాని గుట్టు మగవానికి నాఁడుది మించి యియ్యగా
దంచు వచింతు; రౌనది యదార్థము; ముంగల నిన్ను నొక్కటా
సించినదానఁ గాన నది చెప్పకతీఱదు; నేను బద్ధపా
శ్లెంచఁగ రాధ దయ్యమునుమీ యిది యేమని చిత్తగించెదో. 36

ఒంటిగాఁ బవళింప నూరక నాగుండె, యదరంగ నెగనైచినట్లు తోఁచు
వడిలేచి తెగువతో నడవనూహించునో, నదుమునుఁ బైఁబడినట్లు తోఁచు
కాదని యటులేవ గమకింప వడఁకుచు, నదియే మెం మదియించినట్లు తోఁచు
గోరంతయును గాఁ గూర్చుండఁదలఁచుచో, నట్టె సివంబాడినట్లు తోఁచు
పట్టిపట్టినఁ గొంతవివేక ముండు, జలధిలోఁబడ్డ నొక తెప్ప గలిగియుండు
నింతగా దిక్కు దెసలేని యిట్టివెతలు, నాతలనె పెట్టవలెనె యీ ధాతకైన. 37

అడిగేవారో; మనంబు చల్లఁగను మాటాడేటివారో; ప్రియం
పడ నూరార్చెడివారో; మిక్కిలి దయన్ భాషించుచున్ బుద్ధిఁ దె
ల్పెడివారో; ధృతిలేక యేడ్చుచు మొఱల్ పెట్టంగఁ గన్నీళ్ళు చేఁ
దుడిచేవారో; యొకింత లేఁబగలు నాతో వేఁగువారో కదున్. 38

నలువురు నవ్వఁగా నడవినక్కిశవంబయి పొర్లి యంతలో
మెలఁకువ వన్ననే నుపశమించుక ప్రుళ్ళుచు లోన మించినన్
దలిపిని దెచ్చుకొంచు నొకదిట్టతనాన దినాలు ద్రోసి యిం
తలరితి నిన్నుఁ జూచితి దురాసలు రోసితి క్షేమం చేసితిన్. 39

ఓర్పున భాగ్య మింతెయని యూరక నీసలు కెంతుఁగాక యీ
నేర్పు లిఁకేమి యల్లునవు నీవని నేనపు డెత్తి పెంచి యీ
డేర్పను, నేఁడు తాము రమియించి మగించను, తమ్ముఁ జూచి ని
ట్టూర్పులతో నిటుల్ కరఁగియుండఁగ నేనదియేల యింకిటన్. 40

తన కాదా కడకేళ్లఁగనె వది రాధా నాఁడు గోపాలింతయుం
చును బండ్లంమును గాలియంచుఁ దగులంచుఁ బోయ్యెలం చందుచే.

క. వెనుకఁ దెలిసెను కంసుని, ప పని యది తెలియనేక బలి బిలంబుఁ
జనవలసె మధుర కవ్వల, వినుమందుచె మామ యచట విడివడినకథల్.

గీ. తల్లిదండ్రులు లయ్యుఁ జెర గానుండిరి, చేరఁ దగిలి పెనలఁ దెలువుఁనేక
ననుఁదలంచు దేవకిని వసుదేవుని, నరయవలదె దోషమా లతాంగి

ఉ. కట్టిడిసేఁతలు స్వాతలఁ గంసునితోడ నెడీదెనంచు నే
గుట్టువహించి రాజ్యమునకుఁ బదు వానక వానితండ్రికిం
బట్టముఁగట్టి యాకుదురుపాటవునంతకు నిల్చి యం ను
న్నట్టుల నిన్నుఁ జూడవలెనంచుఁ దలంచుక పైనమైనెడఁ.

మ. సకియా ! కంసునిఁ జంపినామని జరాసంధుండు రోసాన నూ
రక మామీదఁ జలంబుతో దిగి యహోరాత్రంబులంన్ గోటఁ జు
ట్టుక పోరాడు బలంబుతో మగలి పోటుంబంట్లతో దుల్లు సా
ధుకళాటానకుఁగాదె యీనడుమ నేఁ బార్వారి డాఁగుండితిన్.

క. ఈడకువచ్చినఁ గాదని యాడకునుంబోక మనము హాయిగ నెచటన్
కూడానుండుదుమో యని, వేడుకను సముద్రు నడిగి విను నేర్పాటయిన్.

గీ. వనధినడుమను ద్వారక యనగ నొక్క, పురముఁ గల్పించి యందు గాపురము గాఁగ
నచటివారల రప్పించి యిచటి కేను, పైనమైయుంటి నింతలో పలసె వినుము.

శా. వాండ్లు న్వీండ్లు నునుఁ బడంతి యనుచున్ వాత్రువ్వఁగా వించు దా
వింద్లమ్ముల్ శిశుపాలుఁ దండుకొని తీవింపఁ గొనం దోడ వి
ల్కాండ్ల న్వాని జయించి రుక్మిణి నటుల్ వంశాభి మానంబు పై
పెండ్లాడన్వలసెం బయోజముఖి దప్పేనిన్ శమింపందగున్.

చ. ఇవతల నొక్క రాజు తనయింటను రత్నము గాదయోఁ చు సా
యవుదల నిందమోపఁ బరిహారముగా నొకజాడ పెంబడిన్
దవుల వనాంతరంబునను నన్నస మెచ్చి పురాణబుత్రుఁపుం
గవుఁ డగురామదాసు తనకన్యను రత్నము నిచ్చె బల్మిచేన్,

క. అపు డారత్నముఁ దొలంతటి నృపునకు నిచ్చినఁ గుమారి నిచ్చె నతండున్
జపలాక్షి నిందపోకెన, యోపకీర్తికి వారిఁ బెండ్లియాడఁగవలసెన్.

ఉ. జిత్తులకెత్తె లిచ్చకముఁ జేయుచుఁ బ్రియ సానఁగొల్వ నీ
వత్తటి నన్నియు న్మఱచి యంతటఁ జొచ్చితి ; బొంక నేల ; నా
దత్తికి నీవు సేవకను దండనఁ జేసినఁ జేయఁ జెల్లు ; నీ
చిత్తము నాదుభాగ్య మిఁకఁ జెప్పెడి దేమి కురంగలోచనా.

ఉ. ద్రోహినటంచు నేఁడుగద తోఁచెను ; ముందటి చిన్ననాఁటి నా
మోహముఁ జూచితైన నను ముందుగఁ గైకొనరాదె. కోప మే
లే హరిణాక్షి ! నాపదత లేగతినుండిన నుండెఁగాక ; యీ
దేహము నీయధీన ; మిదియెంచియుఁ గౌఁగిటఁ జేర్పరాదఁటే.

సీ. వనచూపక ఫలించు పనసభూజము భంగి, సుదతిరో ! మును మేలు చూపినావు
పూచినంతనె కాచి పొల్పుమామిడిమాడ్కి, నెలఁతరో ! మది దయ నిలిపినావు
పూచి పిమ్మట రాలిపోవుపాటలి కేలఁ, దరుణిరో ! కల్ల ప్రేమ దాఁచినావు
పూచి కాచి ఫలించు భూకల్పకము రీతి, మగువరో ! యిఁకనైన మనుపఁగలవు

గీ. నీకు నీయంతఁ దోఁపని నెనరు ప్రేమ, బలుకువగలను నదరలఁ దెలుపవలెను
నిన్నువంటిది నను వంటివెవరు వానిఁ, జలము సేయుట యిది పూర్వఫలము గాదె.

క. కలికీ ! పలుకవె ; చిలుకల, కొలికీ ! దయఁ జూడరాదె ; కోపం బేలే ?
యలికీరంబుల కిదిగో, యళికను నాడెంద మెందు కలయించెదవే.

గీ. ఆన విడు నీదుపదములనైన ప్రాలి, వేడుకొనిఁయిదె దయపుట్ట విన్నవించి
పదతి కాదేని హృదయతాపంబు దీఱ, నాన విడువుము నీయధరామృతంబు.

గీ. రమణి దాసరితప్పు దండమునఁ బోవు
నందు రందుకు నోఁచనై తిందువదన !
యింక దయనేలుదో భాగ్య మిఁకతో యనుచుఁ
దొలుతఁ దను దోడితెచ్చినచిలుకఁ జూచి

చ. కదకదయుండెదేమె చిలుకా ! మును నమ్మక లీవొసంగఁగాఁ
దోడిఁబడి నమ్మి వచ్చితిని దోచినరీతిని విన్నవించితిన్
గడపట నేమిలేక ననుఁ గంతునిచేతికి నప్పగించె మీ
పడఁతుక, యాను గాదనుచుఁ బల్కదు ; నీవును నూరకుండెదే ?
చిలుకలకొలికికిఁ గలికికి, నలుకఁట పలుకదఁట చలములఁట నీవైన
బలుకువగఁ బలుకుకపురపుఁబలుకలొలుక వలపుఁ జిలుకఁ దలుకవా చిలుకా !

మరుఁడు గుఱిగాఁగ నీనాఁడు మారు యొకటి
చివులఁ జీరదారు చెలుల యూహలీ నేఁడు
నూఁద్ర తీప్పంగ దారింపు ను పదు
భాను యిటులున్న పురగవాఁడఁ [illegible]. 93

వ. అనిన రాధకాతిలకంబు తన పింఛపుంఛలుకం జేరొక్కని యిట్లనియె. 94

క. నే నివ్వానెఁ దను మసుపను, నా నివ్వాను నన్ను వేఁడఁ దనకు న్నాకున్
బూనిక నీసంబంధము, పైనము నీ వడుగ నేరవా యని గదుమున్.

వ. చిలుక యిట్లనియె.

క. నీ వనఁగా నతఁ డనఁగా, నే నన గా జాల; నెల్లగిరులం గిరుల్
నీ వెలుఁగు దాని చెలుఁగు, బోవే యనఁ గృష్ణు దలంక మొగమునఁ దోలఁకన్.

గీ. ఇంత పనిలేనిపనికి నీ కేల పెనగ, నను మదజాలుసిగఁ గేల నదుముకొనుచుఁ
దగటుమప్పటి [illegible] టుగ ఘటించి లేచి తిలమూఁచి రాధను జూచి పలికె.

ఉ. తీరనివాదు తాపమున దీనత నే బతిమాలిచూచి నే
సారతి నింక నీ చెలిమి చాలును నీచెలి నీకు ముద్దు; నే
నూరికిఁ బోయెదం గదుర యుంచవె యుంచు యూఱడింపగా
నేరక పోతి నంచుఁ జెలి నీవెత లెంచెద వింక మీఁదటన్.

చ. సొలయక యున్న దేశములు మాచితి నెందఱితోడ నెస్తముల్
వలిపితి నెంతముచ్చటకుఁ జాలితి; నెవ్వియు నిల్వవాయె నీ
నిలుకడమాట నీ నెనరు నీనిక త్వముఁ జాల నమ్మితిన్
జెలి! కలనైన నన్ను మఱచేవుసుమీ యొక కన్ను చెప్పినన్. 100

చ. కులుకుమిటారి నీవు నెలకొన్న పురంబును నీగృహంబు నీ
చెలులును నీవు నీసొలపుఁ జెన్నులు నీపగలున్ మనంబునన్
నెలకొన గుండె ఝల్లుమను నేఁటికిఁ దీఱని పైనమాయె ముం
గల నినుఁ జూడనౌనొ! యపుఁ గా పరదేశుల కేడవేడుకల్

ఉ. ఒక్కొక్క నాఁటినీపదరి యల్లమునం దలపోసి యే
చిక్కులకైన నోర్చి దరిఁ జేరుదుఁ గా యని చాల నమ్మితిన్
మక్కువలేనిచోట బతిమాలిన నాయది కందుఁ; గాక యా
తక్కువనెస్తమైన మితిదప్పిన వేసట గాదె యేరికిన్.

చ. పకపకనవ్వుచుం జెలంగి పైకొనుచుం రతులం బెనంగి పా
యక మనమున్న చంద మిసుమంతయు నే మఱవంగఁజాల ; నెం
దుకుఁ బలుమాట ; లీతనువుతో నెఱనమ్మిన నామనంబుతో
నిఁక నొకకాంతతోఁ జెలిమియేమన నేయఁగలాఁడ మానినీ !

చ. పలుమరు నీకుఁ గాఁబడినపాటులు నీమన సే యెఱుంగు ; నీ
చలమును నీత్రుణీకృతియు జవ్వని నామన సే యెఱుంగు ; న
న్నల నను వంటి మేలుంగలవాని గడించుకొనఁగ లేవు ; నా
వలనను దూఱు లేదు ; సెలవా యిఁక నీమకు ముద్దుకోమలీ

మ. పరుషై వచ్చితిఁగాని నేరములు నాపైనుంచి కోపించు టే
నెఱుఁగ న్నామది చల్లఁజేసితివి యీ యిల్లేల ? యీయూరేల ? యె
వ్వరు నాకేల ? ఋణానుబంధములు గావా యన్నియు న్నేఁటితో
సరి గాఁబోలును బోయివచ్చెదఁ గటాక్షం బుంచుమీ రాధకా.

మ. అని పల్కన్ విని కల్కి యెంతపలుకయ్యా యింతగా నేరహం
డిన లోచేతువె రాజకన్యకల ; నెంతేఁ జాలుఁ దల్పెల్లఁ బా
లనుచు న్నమ్మెడిగొల్లవారికడ ; నాహా జేము నీచేతులం
గనినా ; మన్నియు నీకటాక్షమున నే కాదా ప్రవర్తించుటల్.

మ. నను నేఁ డెవ్వతెనంచుఁ జూచెదవు కృష్ణా నిన్నుఁ బోకుండ బ
ల్మిని బ్రార్థించెదనంచు నెంచితివొ యేలా యంతకుం జాలవే
యనుఁగుంబోటులయిండ్ల కేఁగదవొ భాగ్యంబాయెఁ బోపొమ్ము ప్రే
మను నేఁ జూచెద నిన్ను నన్నుఁ దగడే మాయూరిపూఁబోఁడులన్.

చ. తెగువల నమ్మలక్కలు పతివ్రతలై నను దూఱువారు ; నే
నొగి వినుదాన ; నీవు కడనుండెడివాడవె ; నీవు వారునుం
దగవున మెచ్చ నేయుదును ; తప్పినఁ జూచెద ; నింటికొల్లనుం
బాగడికఁ దెత్తుగాదె ; యెటుపోయెదు నిన్విడ నెన్నిభంగులన్.

చ. అనుచు బిరాన లేచి వనజాక్షునిదుప్పటికొంగుఁ బట్టి గొ
బ్బున నెటుపారిపోయెదవు పోదువుగా కవి శయ్యమీఁదికిన్
జెనఁగుచుఁ దీయ నొయ్యనఁ దమిన్ బిగికౌఁగిటిలోఁ గదించి రా
ధను నరఁగించె శౌరి తనుతాపము దీఱఁగఁ గోప మాఱఁగన్.

చ. చలమును గోప మీరసము జవ్వని కేడకు డాఁగిపోయెనో
తెలియదు కొంతసేపు తనదేహము తా నెఱుఁగంగలేక మై

క. అన విని రాధిక కృష్ణునిఁ, గనుఁగొని యానన్వమోము కళగల చెక్కుల్
నును మోవియుఁ జెలిగన్నులు, గొనబునఁ బలుమారు ముద్దుగొనుచు న్నగుచున్.

ఉ. తేరని నిద్రమంపు దగదీఱనియూర్పుల పెంపు పచ్చికా
టాఱని మోవి కెంపు చెమటాఱని చెక్కులసొంపు జాఱియుఁ
జాఱని పైఁటలోని బిగిచన్నుల క్రొన్నెలవంక గుంపు చె
న్నారఁ దొయారముల్ గులుక నచ్చెలి యప్పడకిళ్లు విల్వదక్

క. అనఁదగ నెఱిఁగి యెఱుఁగని, దానివలెనె యాయశోద తా నందఁ దనుం
దానయి నందుం డడిగినఁ, బోనీ మఱికేమి యనుచుఁ బొలఁతుక నవ్వెన్, 1

క. ఈరీతిఁ గొన్ని దినములు, శూరిమితో రాధ వగలకున్ లొంగి యా
శౌరి వసియించి యొకనాఁ, డారమణిన్ సమ్మతిల్ల నాడి సుముఖుఁడై.

గీ. పదిగినములకు మఱలివచ్చెదనటంచుఁ, దల్లిదండ్రులతోఁ దెల్పి యెల్లచెలులఁ
బూర్వసఖులను బ్రియమున బుజ్జగించి, రాధతోఁగూడ వెడలె నమ్మాధవుండు.

చ. రథముపయి న్వసించి కవిరాజులు రాజులు శాస్త్రకాండ్రు వే
విధముల వెంటరా నమితవేగముతో నతివైభవంబుతో
నధికముదంబుతోఁ దలఁచినప్పుడె ద్వారక కేఁగుదెంచె దగ
రథగజవాజివీరభటనాథు లెదుర్కొనఁగా మహోన్నతిన్. 1

ఉ. ఇట్లు పురంబుఁజేరునెడ నేమని తెల్పుదుఁ దోరణాల మే
ల్కట్లను మంచెలన్ బురుజుల న్వెడి తేరులఁ జప్పరాలయు
ర్కట్ల జవాదివాసనలు ఘుమ్మన బంగరు మేడలన్ జెలంల్
పాట్లమూగా సుమంబులను బోయఁగ నబ్బుర మయ్యె రాధకున్. 1

మ. హరిఁ జూడన్ బుగ మెల్ల ఘల్లుమనె; నాహా రాధ మాకేడ దా
పురమై వచ్చెనటంచు రుక్మిణి మొదల్ పూఁబోఁడు లేమేమొ యెం
చిరి; శ్రీకృష్ణుఁడు పూర్వపక్షములఁ దా సిద్ధాంతముల్ చేయుచు న్నే
ర్పరిగానెన్ సరిమిద్దెలోన నిడెఁ బూర్వస్నేహయౌ రాధికన్. 15

మ. పయిపై రుక్మిణిసత్యభామల రమింపంగాఁ బదార్వేలుక
న్నియలం గూడఁగ నిర్వికారుఁ డనిన న్నిర్మోహియౌ నిర్జితేం
ద్రియుఁ డౌనన్నను దాల్చియుండె వెనుక; న్నిక్కంబుగా రాధపై
దయవాఁడై యపుడున్న చిన్నెలు వృథార్థత్వంబు లయ్యెం గదున్.

ఉ. చేకొని మంత్రులం గడిగెను సీమహాచక్రత ; కార్యఖడ్గము
స్వీకరించు మాళ్ళయుం గడిచె ; విద్యలఁ బెద్దతనంబులన్ గుల
స్త్రీకులకంబులం దడిరెయుఁ; జెక్కిలిఁ జేసిన రాధతోడిదే
లోకము గాఁగ నుండెనిఁక లోకులు కానుకుఁ దంచు నెంచరే.

చ. కవ విదళిత జక్కవలకై వడి రాధయు మాధవుం డిటుల్
దవులంక యుండఁగాఁ దమరు తాళక రుక్మిణి సత్యభామ జాం
బవతియు మిత్రవిందయును భద్ర సుదంతి కళిందజాతయున్
రవరవ నాడుకొంచు నొకరాతిరి లక్ష్మణయింటికేఁగినన్. 128

చ. పడఁతుక మ్రొక్కి వారికి సపర్యలు సేయుచుఁ దాను వారు నొ
క్కెడ వసియించి నెచ్చెలుల నెవ్వరి నుండఁగనీక రోజనల్
నడుపుచు నీడునం దగుచు నల్వురు నాలుగుమాటలాడఁగా
నుడుగుచు సత్యభామ విభ్రాంతుల రుక్మిణితోడ నిట్లనెన్. 129

గీ. నన్ను గయ్యాళి యందురు కెల్లరెల్లఁ, దెలియవినవక్క పట్టపుదేవి వీవు
చెప్పుమీ నీతోడిసాటిగాఁ జెనఁగఁ జెల్లె, దానవారాతి పారిజాతంబుకొఱకు. 130

ఉ. ఎన్నఁటికైన వానిచను వెవ్వతె నమ్మెను కృష్ణ కృష్ణ యా
యున్నదినాలలోన దయయుంచినవానికితానఁ బెద్దకున్
జిన్నకుఁ గాకయుండ నడపించును ; చేసెడిచావలంటిమా
యున్న వశంబుగాదు నిజ మించుక లేదు తలంచిచూచినన్. 131

ఉ. ఇంచుక రాధనుద్ది మును పేవిని పేఁడితి ; వారు వీరుఁ గ
ల్పించిరటంచు నో రదిమి లేదని బొంకను నాఁడు ; నాఁడె యీ
ట్లించుక యొద్దికైన మన మింతకు రా వదపింతుమే యిఁకం
గొంచెములోన దానిపయిఁ గూరిమి తప్పునె ? తప్పె రోజనల్.

వ. అనిన జాంబవతి సత్యభామ కిట్లనియె. 133

ఉ. ఎందుకుఁ దప్పె రోజనులు కృష్ణునితంట లెతింగి దానిపై
నిందఘటింప జేయుగును జేఁదవుఁ గా దనువారు లేరుగా
కందఱుఁ గారటంచు నివు దక్కట రాధిక మేలుగల్గెనా
యందె రమింపఁగావలె నహర్నిశమునుం బనియేమి యేరికిన్. 134

వ. అనిన మిత్రవింద జాంబవతితో నిట్లనియె. 135

ఉ. ఎవ్వరికిం బనేమి యని యేటికిఁ బల్కెదు నాఁడు నీవు నే
మెవ్వరమంచు నుల్కితి; మొకించుక నేఁపుల నాటపాటల
న్నవ్వుల లోనుజేయవలె నాఁటికి నాఁటికి గాక రచ్చలన్
రవ్వలఁ బెట్టినన్ మనసు రంజిలఁజేయునె యెట్టివారికిన్.

వ. అనిన భద్ర మిత్రవిందతో నిట్లనియె.

ఉ. రచ్చల రవ్వలన్ మనసు రంజిలదంటివి; రాధ కేమిటి
వ్వచ్చెఁ బ్రతిష్ఠ నేఁడు; మగువా మనమందఱు మొక్కమాటగాఁ
గచ్చెగ శౌరితోడఁ బలుకన్వలె రాధను మాకుఁ గూడునే
విచ్చలు మేము గావలెనొ నీకది కావలెనో యటంచుఁ జేకన్.

వ. అనిన సుదంత భద్రతో నిట్లనియె.

చ. అదివలె మేముగావలెనొ యంచు చిపు డాడిన దాని మానునే;
యదివలె మీరుఁగావలె నటంచు చను; నింకొక కేర్పు దెల్పెదన్;
పదటము లేక నందఱముఁ బద్మదళాక్షునితోడఁ బోక నేఁ
డిది మొదలున్ దగించినవహిన్ సమయంబు ఘటింపఁగావలెన్.

వ. అనినఁ గాళింది సుదంతతో నిట్లనియె.

చ. సమయము సేయఁ గృష్ణునకు సాగకపోయిన దేమి; యందుచే
నమరఁగ రాధ కేమికొదువయ్యెను; చిన్నటనాఁటనుండియున్
దమి తలకెక్కియున్న దయుదప్పునె నేర్చిన మేని మందుమం
త్రములను బూని వానికిని దానికి భేదము సేయఁగాఁదగున్.

వ. అనిన లక్షణ కాళిందితో నిట్లనియె.

ఉ. మందును మంత్రమంచ నెదు మంత్రము నిప్పుడు పాటిఁదప్పె; నీ
యందఱు మెచ్చ నే నొకయుపాయముఁ జెప్పెద రాధ చెంతకే
పొందుగఁ జెప్పి పంపుదము " బుద్ధిని బెద్దవు నీవు, నీకు మా
కెందుకు వాదు నీవె తగ నెంచుక దిట్టము సేయు " మంచనిన్.

వ. అనిన రుక్మిణీరమణీశిరోమణియక్కామినీమణులం గనుంగొని నవ్వుచు నిట్లనియె.

ఉ. నిందలు సేయ నెందుకుఁ దృణీకృతి యెందుకు మించవాడఁగా
నెందుకుఁ గాదు కన్నడ దన నెందుకు మోడి వహించి యుండఁగా
నెందుకు మందు మంత్ర మన నెందుకు దైన్యముతోడ వేఁడుకో
నెందుకు సేవఁ జింతు నొకయుక్కువ యుంచుక విందు సేనియున్.

మ. మనోభోగంబుల నేమితక్కువలుగా మన్నించ నేనేశక్తి
నను మాటాడఁడొ బుజ్జగింపఁడొ రతిన్ మల్లాడుచుం దృప్తిగాఁ
దనువుల్ సౌఖ్యము లొందఁజేయఁడొ మనోతాత్పర్య చిత్తంబునన్
మనలోనన్ మనవారి యీర్ష్యలు వహింపన్ వారిని నేరముల్.

సీ. ఒకనిసొమ్మేమి వేఱొక్కనిసొమ్మేమి, చక్కెర కమరునే చిక్కఁదనము
లోకులం గననేమి తాఁ గనుంగొననేమి, వెన్నెల పూనునే విన్నఁదనము
అంత గ్రోలనేమి యింత గ్రోలనేమి, యమృతాన కబ్బునే యల్పతనము
చెంత నుండిననేమి చేత నుండిననేమి, విరిబంతి కబ్బునే వెగటుఁదనము

గీ. ఒకతె చవిఁగొన్న లేదె మోవికిని ఓపి. నలుగురును జూడ లేదె నవ్వులకుఁ దలివి
మాట యొకమాటువిన్నఁ జాల్ మనకు తృప్తి, శౌరికడనుండనను లేదెసంతసంబు. 147

మ. వినుఁ డేవేళను గష్టఁ డేనగరికిన్ వెంచేసెఁ దా నెవ్వతెం
గని మాటాడెను వార లప్పటికిఁ బల్కన్ మేర సర్వజ్ఞుఁడౌ
ఘనుఁ డేలా పారవశ్యముల్ నడపు నింకన్ మానుఁ డీవార్త లో
య్యన నారాధ యొకింత విన్న మనకే యాఁ జిన్నపో హీనముల్.

చ. అన నిది యుక్తమంచు నవు డందఱు సమ్మతిఁజేసికొంచు నె
ల్లని తమయిండ్ల కేఁగి యొకలాగున నుండిరి వారిమాటలే
యొనరిఁకఁ బొంచులుండి విని యొద్దికఁ దెంపుదుడుక్క గ్రక్కునన్
దనకు వచింప, రాధ విని తా నది శౌరికిఁ దెల్పఁ గల్పనన్. 149

క. ఈనుడువు లిపుడు వింటివె, యానడుమును నీవు చిలుక నంపిననాఁడే
నానావిధముల నడిగిరి; మానవతీ! నీదురాక మహి నల్పంబే. 150

వ. అనిన రాధికావధూతిలకం బతిముదంబునఁ గృష్ణునితో నిట్లనియె.

సీ. పల్లెతావులనున్న గొల్లదానిని దెచ్చి, నిధిరత్నములయందు నిలిపినావు
చెలఁగి రాధామాధవులచెల్మి హో యన, బిరుదైనకీర్తిఁ గల్పించినావు
ప్రౌఢలైన కిరీటపతులకన్యల మాని, నన్నుఁ బ్రాణపదముగా నడపినావు
సకలవిద్యారహస్యము తెలుంగఁగఁ జేసి, దేహ మానంద మొందించినావు

గీ. నేఁడు నాపాలిదైవంబు నీవె యనినఁ, జాల దీమాట నామహోత్సాహమునకు
నెంతసంతోషపడెదనో యెఱుక లేదు, మందటి కిటు చేయు సర్వజ్ఞమూర్తి వీవు 152

గీ. ఒకటఁ గొఱఁతయు లేక నే నున్నదాన, నైన నావిన్నపం బిపు డాదరింపు
నీదుపట్టపుదేవులు నేను నీవు, బంతిభుజియింపవలె రేపు సంతసమున. 153

చ. అని మఱునాఁడు వారికిఁ బ్రియంబుగ సమ్మతిగాఁగ శౌరిచే
తనె పిలిపించి వారలును దానును గృష్ణునిఁగూడి బంతులై
యనువుగఁ బంచభక్ష్యపరమాన్నములన్ జవు లెంచికొంచు భో
జన మొనరించి ధౌతకరసారసులై ముదమంది రందఱున్. 154

మ. నవరత్నస్థగితంపుసొమ్ములను నానాగంధపుష్పాదుల
న్నవరంగత్కనకాంబరంబులను గాంత ల్వింతలై చేరి చు
ట్లవసింపం గొలువున్నమాధవుని దండ న్నిల్చి యారాధ మ
క్కువతోఁ బల్కెను గప్పురంపునునుబల్కుల్ దళ్కులం జిల్కఁగన్.

మ. పొలుపౌ రుక్మిణిసత్యభామలకు నీపొంబోండ్ల కాయున్నక
న్నెలకు న్నేఁ జెలికత్తెనై తెలిపెదన్ వీరల్ ధవశ్రీసతిక
కలహం బందఁగనేల ? పంచి వరుసల్ గల్పించి గోపాల వీ
రలరన్ దిట్టము చేసి చేసెదనుమాధ్యస్థంబు నే నియ్యెడన్. 156

చ. ఒకనెల కొక్కమేర వినుఁ డున్నదినంబులలోఁ బదాఱువే
లకును బదాఱునాళ్ళు ; లవల న్మఱి యాగ్గురి కాఱునాళ్ళు నొ
క్కొకటిగ లక్షణాదులకు నొప్పగు ; సత్యకు రెండునాళ్ళు ; నం
దుకు నొక హెచ్చు రుక్మిణికిఁ దోఁచినచో దయ నిల్పు పత్రికన్. 157

గీ. అనుచు నోయక్కలార నే నంటి ననుచుఁ, గోప మంతకుఁ డీమేర కొదువగాదు
సమ్మతిలుఁ డంచుసతులమొగమ్ముఁ జూచి, హరికిమొదలుగ రాధ యందఱకు మ్రొక్క

క. కూర్చుండు మనుచు రాధం, గూర్చి పడంతుకలు మెచ్చుకొనుచుం బ్రియముం
గూర్చిపలుకంగఁ గృష్ణుఁడుఁ, గూర్చుండఁగ విడిరి నవ్వుకొనుచుం జెంతన్. 159

ఉ. అంతట వారి వారిని గృహంబులకున్ సెలవిచ్చి రాధికా
కాంతను గృష్ణదేవుఁడు తగనే గరఁగించి చెలంగి వింతకున్
వింతలుగాఁ దమిన్ వరుసపెంపడి నందఱయిండ్ల కేఁగి యా
త్యంతవిలాసమార్గముల దక్షిణనాయకుఁ డయ్యె నున్నతిన్. 160

క. విను రాధామాధవకృతి, మనమున నిడి వినినఁ జదివి మఱి వ్రాసిన మె
చ్చిన యాధన్యాత్ములకున్, వనజాక్షుఁ డొసంగు సకలవైభవము దయన్. 161

గీ. అనుచు శుకయోగి తెలుప సజ్జనకవిభుఁడు
కృష్ణుఁడును రాధయును గాక యిఁకను గలరె
దైవము లటంచు వారలె ధ్యానమునను
దలఁచి మ్రొక్కుచు శుకయోగిఁ గొలిచియుండె. 162

ఉ. కృష్ణయమంత్రివృత్తి! సుకవీంద్రముఖాంబుజకంజమిత్ర! శ్రీ
కృష్ణపదాబ్జసంతతవశీకృతచిత్త! వశీనచిత్తజా!
జిష్ణుసమానభోగ! గుణచిత్రవిశేష! గభీరసాగరా!
వైష్ణవసమ్మతప్రకటవస్తువిచారణ! మంత్రివారణా! 163

క. చతురతరవచనరచనా, చతురానన! కవినిధాన! సంతతదానా!
మితభాషణ! హితపోషణ!, మతితోషణగుణధురీణ! మాన్యవిహరణా! 164

మాలిని. మగదలకులధీరా! మానినీచిత్తచోరా!
యగణితగుణహారా! యర్థిరాధాకుమారా!
నిగమవిధివిహారా! నిత్యసౌఖ్యానుసారా!
సగరభవగభీరా! చారుశృంగారవీరా!

గద్య. ఇది శ్రీమద్వేణుగోపాల వరప్రసాదలబ్ధ శృంగార కవిత్వవైభవ
ఇలిదిండ్ల తిరువేంగళార్యతనూభవ విద్వజ్జనవిధేయ వేంకట
పతినామధేయ ప్రణీతం బైన రాధామాధవ సంవా
దంబను మహాప్రబంధంబునందుఁ సర్వంబును
తృతీయాశ్వాసము.
సంపూర్ణము.

# పోతులూరి వీరబ్రహ్మముగారి జీవితము



'భారతాధ్యాత్మిక ప్రభ భాగ్యమొక్క భరతజాతికి గాక యెవ్వరికి గలదు'

అయ్యలారా! విశ్వప్రపంచైక విజ్ఞానఫలదాయిని, వేదకల్పకమున కాలవాలము, సంకల్పమాత్రమున జగన్నిర్మాణమొనర్పదక్షులగు తపోధనుల కాస్పదము, సత్యగతూదిదిదృక్షా దీక్షితులైన హరిశ్చంద్రాదు లేలిన పవనభూమి, పరశురామ, ద్రోణ, పాండవేయాది వీరులంగన్న వీరమాత శంకరాది మతాచార్యులకు పుట్టినిల్లు. భువనైకపావని యను ఖ్యాతి నందిన భరతఖండంబున నెందరో మహాత్ములు పుట్టి గిట్టుచున్నారు. మీరు గాంధీమహాత్ముడు తిలక్ మొదలగువారి నెందఱినో చూచుచున్నారు. రామకృష్ణ పరమహంసాదులను విని యున్నారు. రామదాసాదుల జీవితముల నుజదివియున్నారు వారందరిని మితిమీఱిన భూతభవిష్యద్వర్తమానవేది, అద్వైతనమాంబునిధి, పక్కా వేదాంతి గృహస్థాశ్రమములో వుండి పరతత్వమెఱింగిన బ్రహ్మవేత్త అతని కాలజ్ఞానవచనమును జూచి వేదాంగవేత్తలు విభ్రాంతులైనారు. తత్వజ్ఞాన వైదుషి, గృహస్థాశ్రమమందుండియే నిత్యశుద్ధిగా నెఱపిన వైష్ణవ సంపత్తి, యోగీంద్రులు తలక్రిందు లగుట జూపిన మహాత్త్వము, వేనోళ్ల పొగడని వేదాంతులే లేరు. అమ్మహనీయుని నిప్పటి నెఱింగిన వారు వేళ్ళమీద లెక్క పెట్టదగినట్లుగా నున్నారు. అతడే పోతులూరి వీరబ్రహ్మపరమయోగి ఆ తత్త్వవేత్తజీవితచారిత్రము జనసామాన్యమునకు సుబోధకమగునటుల సులభశైలిలో యించుమించు 200 పుటలలో సమకూర్చి ప్రచురించినాము. దానింజదివినవాడే ధన్యుడు నేడే చదువ యత్నింపుడు. దానివలన నీవొందు ఫలితము మున్ముందు తెలియగలదు.

వెల రు **1-0-0**

పొందుగఁ బ్రొద్దుపోకలకుఁ బూనితివేనియు మేము నేరమీ
యందఱవంటిముచ్చటలు నాటలు పాటలు నోటిమాటలున్. 42

క. చిన్నప్పుడె యెడఁబాయక, కన్నుల నిన్నెపుడుఁ జూడఁగలిగుండును నేఁ
డెన్నంగ నీదుసముఖము, క్రొన్నెలపాదు పద్యో గగనకుసుమం బయ్యెన్ 43

చ. అరమరలేక నీకొఱకు నల్లికబిల్లికగా వసించు మి
ద్దఱ మపు డెవ్వరున్ మనలఁ దాఁకి తలంపరు నేఁడు వింటివో
మఱి వినలేదొ యీజనులమాటలు వాదల నాద సాద నీ
పరువులు చూచి నాపయిని పాపముఁ గట్టిరిఁ కేమితెల్పుదున్. 44

క. మచ్చరమున నొక రనుకొన, నొచ్చెము నాయందుఁ గలదె యొకనాఁడైనన్
ముచ్చటగా నినుఁ గౌఁగిఁట, గ్రుచ్చితినో లేనిచోరవకుం జొచ్చితినో 45

క. నే నిందుకొఱకె నవ్వస, హో నోడుదు వట్టినింద లందిట నయ్యో
యైన గిఁక నాయెనందుకె, పూనుద మందఱుఁ గన్న పాడిచినరీతిన్. 46

క. నామనసులోనికోరికి, నీమజనంబులె నిజంబు చేసిరి మన కీ
నీమం బెందుల కీవఱ, కేమాయెను గొదవ లోకు లిటులాడుటచేన్. 47

సీ. చూడనేర్చిననాఁడె సొలపుగా మునుమున్నె, చేరంగ నను గటాక్షించినావు
నవ్వనేర్చిననాఁడె ననుపుగాఁ దొలుదొల్త, నాతోడ వగగుల్క నవ్వినావు
పల్కనేర్చిననాఁడె భావంబుగా ముందు, నత్తత్త రమ్మని యాడినావు
నడవనేర్చిననాఁడె నమ్మికగాఁ దొల్త, దొడరి చేపట్టి కాల్ద్రొక్కినావు
నాఁడు సేయనియోజన నేఁడు గలదె మఱఁదు దైవంబు సాక్షులు మనమనములు
విను సదాచారనిరతులు విబుధులైన, ఘనులు తారాశశాంకులు గాదె మనకు. 48

చ. అన విని రామ రాధ యిటు లాడఁగఁ జెల్లునె నీకుఁగాక నా
మన సరయందలంచితివొ మక్కువతోఁ గరుణించి నీవు పెం
చినతను వింత నీ వగడుసేసిన కాదనువార లెవ్వ రిం
దున కొడిగట్టినన్ వెనక దోసము గాదఁటె రాధికామణీ. 49

క. నీతోడఁ జర్చసేయఁగ, బోతే నామనసు కొకటి పొడమినఁ బోదమున్
నీతోడఁ బలుకరాదిఁక, వారప్పతి మొదలఁ బడుచువాఁడను నేనున్. 50

క. అని విలుగ నాడి యంతనె, తపసంగడికాండ్రు పిలువ, దానాపలుకుల్
విని హో యని యులుఁగిచ్చుచు, వనజాక్షుఁడు వెడలె మురల వచ్చెద ననుచున్.